శ్రీరస్తు.

శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః.

ఆపస్తంబమహర్షి ప్రణీతాద్యనేకధర్మ

శాస్త్రములనుండి సంగ్రహింపంబడి

లోకోపకారార్థము

నగరి ఉపాధ్యాయులవారగు

కండాగరం - తంబయ్యగారిచేత

ఆంధ్రభాషయందు రచియింపంబడిన

---

# ఆచారసిద్ధాంతము.

---


అనర్ఘగ్రంథము

చెన్నపురి,

బరూరు - త్యాగరాయశాస్త్రులవారి

గీర్వాణభాషారత్నాకర ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1913 సం.




పోస్టేజి ప్రత్యేకం] [వెల 1-8-0

# ప్రకటన.

ఈ పుస్తకములు వలయువారు

ఈ దిగువ చిరునామాకు వ్రాసి తెప్పించు

కొనవలయును.

గుండాగరం - తంబయ్యగారు.

45 నమ్మాళ్వారువీధి.

మద్రాసు.



శ్రీ ర స్తు.



ఓంనమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైక మూర్తయే ।
నిర్మలాయ ప్రశాం[illegible]య దక్షిణామూర్తయేనమః ॥

ఆపస్తంబమహర్షిభ్యోనమః.

ఆపస్తంబమునింవందే యత్ప్రసాదాదమీవయం।
స్వర్గాదిమోక్షపర్యంతం వైదికీం సిద్ధిమాప్నువః ॥

# పీఠిక.

ఈ ప్రపంచమున బ్రహ్మ క్షత్రియ వైశ్యులు మానవజన్మమెత్తినందులకు పితృమాతృవులు స్వర్గాది మోక్ష పర్యంతము సుఖమందుటకు పైతృమేధికాది కర్మను చేయవలయుననుట లోకవిదితమే గదా ! పూర్వము సర్వజ్ఞులగు మహర్షులీకర్మానుష్ఠానంబున కనేక ధర్మశాస్త్రములు రచించిరి. ఈ గ్రంథములలో భారద్వాజ సూత్రము, పరాశరమాధవీయము, నిర్ణయసింధు, ధర్మప్రవృత్తి యల్లాజీయము పైతృమేధిక సారసంగ్రహము ముఖ్యములైనవి. ధర్మశాస్త్రమిటుల గ్రంథబాహుళ్యముగను, గీర్వాణ భాషయందు వ్రాయబడియుండుటంజేసి ప్రాకృతభాషా పాండిత్యము గల యాజ్ఞికులకుఁదప్ప ఇతరసామాన్య విప్రులకు దానినెఱుంగుట కఠినముగానున్నది. ఈకాలము పండితవర్యులు కొందరు ఈ గ్రంథములకుఁ దాత్పర్యమును రచియించిరిగాని ఇవి పూర్వపక్ష సిద్ధాంతములతోఁ గూడియుండుటం జేసి సిద్ధాంతమును గ్రహింపలేక పెక్కుదేశములయందు పైతృమేధికాది కార్యములఁ జేయించు విప్రులు శ్రమపడుచుండుట నింతయని చెప్పనలవిగాక యున్నది.

ఇట్లు ధర్మశాస్త్ర సందేహముల నెఱుగమిచే కర్మల నాచరించియు సఫలముగాకయుండుటఁజూచి వీనిని మాన్పు కోరికగలవాఁడై మద్వంశజుఁడగు గుండాగరం - నరసింహశాస్త్రులు ఈగ్రంథముల నంతయు జక్కఁగ పరిశీలించి వాని సారాంశముల మాత్రము అపరసిద్ధాంతమను పేర గీర్వాణభాషయందు ఒక గ్రంథమును రచియించిరి. ఇది సహిత మెల్లరుకును నత్యంత ఉపయోగకారి గాక యున్నది గాన ఈగ్రంథమును తెనుగుభాషయందు సులభశైలిని స్వానుభవముతో పరికించి దేశాచారానుసారముగా రచియించితిని. ఈగ్రంథమును ముద్రాంకితము చేయుండని యనేకులు నన్ను బ్రోత్సాహపరిచి నందున విశేషజ్ఞులగు పండితులచే పరిశోధించి ప్రచురించితిని.

ఈ గ్రంథమునందు తప్పులు లేవని గట్టిగా చెప్పజాలను. దీనియం దెచ్చటనైనను లోపములున్నయెడల వానిని వివరముగా నాకు నెఱుకపరిచిన రెండవకూర్పున సవరించువాఁడనుగాన బుధోత్తములను ప్రార్థించువాఁడను.

ఈ గ్రంథరచనయందు నాకత్యంత సహాయుఁడై యుండిన పెద్దపవని వాస్తవ్యుడగు బండేపల్లి అబ్బులుశాస్త్రులవారికిని, నీగ్రంథము ప్రచురింపఁ బ్రోత్సాహము చేసిన నామిత్రులకును నేనంతయు కృతజ్ఞుడను. ... ... ※

౪౫ నమ్మాళ్వారువీధి.
మద్రాసు.



ఇట్లు,
సర్వజన విధేయుఁడు,

**నగరి ఉపాధ్యాయులు**

 **తంబయ్యా.**

ఈ గ్రంథమునకు సంబంధించిన సర్వప్రాయశ్చిత్త ప్రయోగమును, దానవిషయమును అచ్చు అగుచున్నవి.

శ్రీరస్తు.

శ్రీదక్షిణామూర్తయేనమః.

# అపరసిద్ధాంతము.

## విషయసూచిక.

## పైతృమేధికప్రకరణము.

---*---

| | పుటసంఖ్య. |
|---|---|
| తిధివిషయః | ౧ |
| రాత్రినిర్ణయః | ౨ |
| అయననిర్ణయః | ,, |
| ఋతునిర్ణయః | ,, |
| మృతికి దోషములు | ,, |
| భద్రతిధిః | ,, |
| నందతిధిః | ౩ |
| రిక్తతిధిః | ,, |
| వారనిర్ణయః | ,, |
| ద్విపాదినక్షత్రాణి | ,, |
| త్రిపాది నక్షత్రాణి | ,, |
| ధనిష్ఠాపంచక నక్షత్రాణి | ౪ |
| మరణానంతరం కర్తృనిరూపణము | ౪ |
| బ్రహ్మచారికర్తృనిరూపణము | ౫ |
| బహుపుత్రత్వే జ్యేష్ఠస్యైవ కర్తృత్వవిధిః | ,, |
| దేశాంతరముననుండు జ్యేష్ఠుడు చేయువిధిః | ,, |
| దేశాంతరస్థితుఁడగు జ్యేష్ఠుఁడు సంచయనాత్పూర్వమువచ్చిన | ,, |
| దశాహమధ్యే దేశాంతరస్థిత కనిష్ఠకర్తవ్యం | ౬ |
| దశాహానంతరం దేశాంతరస్థిత కనిష్ఠకర్తవ్యం | ,, |

| పుటసంఖ్య. | | పుటసంఖ్య. | |
|---|---|---|---|
| శౌణకర్తృత్వవిధిః | ౬ | కర్తృవపనవిధిః | ,, |
| సంవత్సరమధ్యే దేశాంతరస్థిత పుత్రకర్తవ్యం | ౭ | ఆశ్వలాయన [illegible]విధిః | ౧౧ |
| దేశాంతరమునందు పుత్రులు మాతాపితృమరణమువినిన | ,, | విభక్తకర్తృత్వ విషయః | ,, |
| సంచయనానంతరము దేశాంతరస్థిత పుత్రకర్తవ్యం | ,, | రాత్రౌ వపనవిధిః | ,, |
| అనుపనీతకస్య కర్తృత్వవిధిః | ,, | ఉత్క్రాంతివిధిః | ,, |
| స్వీకారానంతరం పుత్రజననే కర్తవ్యం | ౮ | తిలపాత్రదానవిధిః | ౧౨ |
| కొమారుఁడు మూగవాఁడైన చేయువిధిః | ,, | కర్ణమంత్రపఠనవిధిః | ,, |
| పుత్రహీనయగు స్త్రీకి కర్తృనిర్ణయః | ,, | షణ్ణిమిత్తప్రాయశ్చిత్తవిధిః | ,, |
| జీవపితృకస్య కర్తృత్వవిధిః | ,, | పర్యుషిత శవదహనేదోషః | ,, |
| పుత్రానుజమరణే కర్తృత్వవిధి నిషేధౌ | ,, | అనాహితాగ్నినిర్ణయః | ౧౩ |
| రజస్వలాకర్తృక భర్తృదహన నిషేధః | ,, | ఉత్తపనాగ్ని విషయః | ,, |
| శుద్ధివిషయః | ౯ | కపాలాగ్ని విషయః | ౧౪ |
| దేశాంతరస్థిత కర్తృనిర్ణయః | ,, | అనుపనీత సంస్కారవిధిః | ,, |
| ప్రథమదినే వపనవిధిః | ,, | వివాహిత ద్వివర్ష కన్యామరణే | ,, |
| గ్రంథాంతరే వపనవిధిః | ,, | కన్యాదానాత్పర ప్రధాన హోమాత్పూర్వం వధూవరయోరగ్నినిర్ణయః | ,, |
| జ్ఞాతి వపనవిధిః | ౧౦ | యతిభార్యామరణే | ౧౫ |
| అన్నకుమారుని వపనవిధిః | ,, | ద్విభార్యాగ్నినిర్ణయః | ,, |
| జీవపితృకస్య వపనాదినిషేధః | ,, | ఏకకాలే ద్విభార్యామరణే | ,, |
| | | శవనిరహరణక్రమః | ౧౬ |
| | | శ్మశానమునకు కొనిపోయిన శవముబ్రతికిన | ,, |
| | | పుత్రదహన నిషేధః | |
| | | శవమును గ్రామమునుండి తీసి కొనిపోవుట | ౧౭ |

పుటసంఖ్య.

శవముతో కూడపోవు విధాయకము ,,
ఆశ్వలాయన విషయః ,,
శ్మశానమునకు శవమునుగొని పోయిన ,,
అనుక్తప్రాయశ్చిత్తవిధిః ౧౮
అగ్నిపతనే భాండపతనేవా ,,
శవపతనే ,,
అగ్నిపాత్రభిన్నే ,,
దహనదేశ నిర్ణయము ,,
దహనప్రకారః ౧౯
కుంభచ్ఛిద్రోదకధారా ప్రదక్షిణము ,,
అనాథబ్రాహ్మణ సంస్కార ఫలము ,,
రాత్రౌ స్నానవిధిః ,,
రాత్రౌ పైతృమేధిక నిషేధః ౨౦
తిలోదకవిధిః ,,
తిలోదకప్రకారః ,,
శిలాప్రతిష్ఠ ,,
శిలాలక్షణము ,,
నిత్యపిండదానవిధిః ౨౧
పిండస్యవినియోగః ,,
పిండస్యకాకస్పర్శనియమః ౨౨
పిండస్యశ్వాదిదూషణే ,,
గ్రస్తాస్తే పిండదానప్రకారః ,,

పుటసంఖ్య.

రాత్రౌ తిలోదకాదీనాం నిషేధః
స్థలాదివిపర్యాసే ,,
దేశవిపర్యయే అపకర్షః ౨౩
దశాహమధ్యే తిలోదకపిండదానక్రమః ,,
ప్రేతశిలానాశే ,,
అనేకులేక కాలమున మృతినొందిన ౨౪
బహుమరణేషు ,,
తండ్రిదశాహస్సులోపల తల్లి మృతినొందిన ,,
తల్లిదశాహస్సులోపల తండ్రి మరణించిన ౨౫
తండ్రిదశాహస్సులోపల ఇతరులెవ్వరైన చనిపోయిన ,,
తండ్రిదశాహానంతరం ఇతరులు మరణించిన ౨౬
తండ్రి దశాహస్సు ప్రాప్తః కాలమున మృతినొందిన ,,
తల్లి దశాహపూర్వము పుత్రుండు మరణించిన ,,
మృతతిథి తెలియకపోయినా ,,
పునఃసంస్కారవిధిః ౨౭
సంవత్సరమధ్యే సంస్కారవిధిః ,,
పునర్దహన నిషిద్ధకాలాః ,,
కాలమతిక్రమించినపుడు

| | పుటసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|---|
| చేయువిధి | ,, | దశాహమధ్యే దర్శసంక్రమాదౌ | ౩౩ |
| త్రిపక్షాత్పూర్వం కాలనియమాః భావః | ,, | అమావాస్యాయాం మరణే | ,, |
| ఏకోద్దిష్టానాం కాలనిర్ణయః | ౨౮ | త్రిరాత్రాశౌచ దర్శసంక్రమాదౌ | ,, |
| ఏకోద్దిష్టానాం తిథినిర్ణయః | ,, | దేశోపద్రావాది సంప్రాప్తే | ,, |
| ఏకోద్దిష్టము చేయువిధి | ,, | దహనానంతరం కర్తాగృహప్రవేశక్రమః | ౩౪ |
| సపిండీకర్తైకోద్దిష్టే యావాహనాదివిధిః | ,, | దహ్యమానాగ్నినష్టే | ,, |
| ఏకోద్దిష్టే నిషిద్ధాని | ,, | సంచయనవిధిః | ,, |
| దశాహాత్పూర్వం నిషిద్ధాని | ౨౯ | సంచయనప్రకారః | ౩౫ |
| నగ్నశ్రాద్ధ ఆమవిధిః | ,, | స్మశానాగ్ని ఆరిపోయిన | ,, |
| ఉపవీతవిధిః | ,, | దహనమమంత్రవత్తుగా జరిగిన | ,, |
| దశాహమధ్యే శ్రాద్ధానాం అమంత్రకత్వవిధిః | ,, | శాఖాంతరస్య కర్తృత్వేపి పైతృమేధికవిధిః | ,, |
| నవశ్రాద్ధవిధిః | ౩౦ | సంచయన నిత్యకర్మప్రారంభస్యవిధిః | ౩౬ |
| నవశ్రాద్ధము నిలిచిపోయిన | ,, | ప్రేతాశ్వలాయన శాఖీయుండై కర్తయాపస్తంబసూత్రుండైన | ,, |
| త్రిరాత్రాశౌచ నవశ్రాద్ధవిధిః | ,, | గంగాంభసి అస్థినిక్షేపణవిధిః | ,, |
| త్రిరాత్రాశౌచే శిలాస్థాపన తిలోదకవిధిః | ,, | బహిర్దశాహే అస్థినిక్షేపణవిధిః | ౩౭ |
| భోగశరీరోత్పత్తిః | ౩౧ | దశమదినే ప్రేతభార్యా రజస్వలవిధిః | ,, |
| త్రిరాత్రాశౌచ ఏకోద్దిష్టా సపిండీకరణాని | ౩౨ | పుత్రహీనయగుస్త్రీ స్వకర్తృత్వరజస్వలావిధిః | ,, |
| త్రిరాత్రాశౌచే జ్ఞాతితిలోదకవిధిః | ,, | | |
| ఆశౌచ నియమః | ,, | | |

| | పుటసంఖ్య. |
|---|---|
| దశమేహని వపనవిధిః | ,, |
| దశమేహనిజ్ఞాతీనాం తిలోదక విధిః | ౩౮ |
| దేశాంతరస్థిత జ్ఞాతి తిలోద కవిధిః | ,, |
| మాతామహ కర్మవిధిః | ,, |
| పూర్వాశౌచ ఉత్తరాశౌచ జ్ఞాతితిలోదకవిధిః | ౩౯ |
| అసన్నిధానే జ్ఞాతీనాం తిలో దకవిధిః | ,, |
| స్త్రీకర్తృత్వజ్ఞాతి తిలోదకవిధిః | ,, |
| సపిండీకరణానంతరం జ్ఞాతి తిలోదకవిధిః | ,, |
| బ్రహ్మచారిణాం తిలోదక నిషేధః | ౪౦ |
| జీవపితృక భ్రాతృమరణే | ,, |
| తిలోద్వాసనానంతరం ధర్మోదక విధిః | ,, |
| ఏకాదశేహని విధిః | ,, |
| ఏకాదశేహని కర్తృభార్యా రజస్వలావిధిః | ౪౧ |
| నవమదశమేహని కర్తృభార్యా రజస్వలావిధిః | ,, |
| షోడశమైనతర్వాత కర్తృ భార్యారజస్వలావిధిః | ,, |
| పితాశౌచమధ్యే కర్తృమా | |

| | పుటసంఖ్య. |
|---|---|
| తృభార్యాప్రసూతౌ | ,, |
| ఏకాదశేహని జాతాశౌచ మృతాశౌచవిధిః | ౪౨ |
| ఆద్యైకోద్దిష్టవిధిః | ,, |
| ఆద్యైకోద్దిష్టస్య ద్విరావృత్తి విధిః | ,, |
| స్వతంత్రైకోద్దిష్టస్య బ్రాహ్మ ణాభావే | ,, |
| ద్విరావృత్తి ఆద్యమాసికస్య విఘ్నసంభవే | ౪౩ |
| రుద్రగణశ్రాద్ధవిధిః | ,, |
| వృషోత్సర్జనవిధిః | ,, |
| సువాసినీ విషయే | ,, |
| ఆశక్తవిషయే | ౪౪ |
| వృషోత్సర్జనే యజ్ఞోపవీత విధిః | ౪౪ |
| వృషోత్సర్జనేపరిధివిధిః | ,, |
| వసుగణశ్రాద్ధవిధిః | ,, |
| ఏకోద్దిష్టవిధిః | ,, |
| షోడశవిధిః | ౪౫ |
| షోడశ వివరము | ,, |
| అగ్నౌకరణవిధిః | ౪౬ |
| పిండప్రదానవిధిః | ,, |
| బ్రాహ్మణసంఖ్య | ,, |
| షోడశ ఆమవిధిః | ౪౭ |
| అనుమాసికములవిధిః | ,, |

పుటసంఖ్య.

మలమాసవిధిః ,,
మలమాసేమృతస్య ఆబ్దికమా
సికవిధిః ,,
మృతసంవత్సరమధ్యే మల
మాసే ౪౮
మలమాసే మృతస్య పూన
మాసికవిధిః ,,
మలమాసే మృతస్య ప్రత్యా
బ్దికవిధిః ,,
శుద్ధమాసే మృతస్య ప్రథ
మాబ్దికవిధిః ,,
ద్వాదశాహాదిషు సపిండీకరణే
మాసికాపకర్షః ౪౯
త్రిపక్షాదిషు సపిండీకరణ
మాసికవిధిః ,,
సపిండీకరణాత్పూర్వం వృద్ధి
మాసికనిషేధః ,,
,, నంతరం వృద్ధిశ్రాద్ధే
అనుమాసికాపకర్షః ,,
ఊనానాం ఉత్కర్ష అపకర్ష
నిషేధః ౫౦
సపిండీకరణకాలాః- గ్రంథాం
తరే ,,
,, వారాః ,,
,, కర్తారః ,,
ఉత్క్రమసాపిండ్యవిధిః ౫౧

పుటసంఖ్య.

పునఃక్రమసాపిండ్యము ,,
నగ్నప్రచ్ఛాదీనాం పునఃకరణ
నిషేధః ,,
జ్యేష్ఠేనపునః సపిండీకరణ
విధిః ౫౨
మాతుస్సాపిండ్యము ,,
అన్వారోహణస్సాపిండ్యము ,,
పత్న్యాస్సాపిండ్యము ౫౩
భర్తృసాపిండ్యము ,,
పుత్రస్యైవ పితృసపిండనాధి
కారః ,,
శ్రాద్ధదినే గృహాలంకార
నిషేధః ౫౩
తృష్ణావారినిషేధః ౫౪
దేవతార్చనాదినిషేధః ,,
జ్యేష్ఠపుత్రసద్భావే కనిష్ఠస్య
సపిండీకరణకర్తృత్వనిషేధః ,,
సపిండీకరణ స్వరూపము ,,
సపిండీకరణ సంకల్పః ,,
సపిండీకరణే పితామహాదీనాం
అస్మచ్ఛబ్దేనసంబంధనిర్దేశన ౫౫
వృద్ధశబ్దనిషేధః ,,
ఆచమనకాలాః ,,
నామోచ్చారణ విభక్తినిర్ణయః ,,
ఆశ్వలాయనానాం గోత్రా
ద్యుచ్చారణక్రమః ,,

| | పుటసంఖ్య. |
|---|---|
| నిమంత్రణీయ బ్రాహ్మణ సంఖ్య | ౫౬ |
| శిష్టాన్వర్చనవిధిః | ,, |
| నిమంత్రణవిధిః | ,, |
| ,, కాలాః | ౫౭ |
| ఉపవీతవిధిః | ,, |
| పాదప్రక్షాళనే కర్తుః పశ్చి మాభిముఖత్వ నియమః | ,, |
| ,, కర్తృభోక్త్రు ఉపవేశన నియమః | ,, |
| గుల్ఫాదూర్ధ్వం పాదప్రక్షాళన నిషేధః | ,, |
| పాదాభ్యంగవిధిః | ౫౮ |
| శ్రాద్ధదినే కర్తృభోక్త్రువా ఆశౌచ ప్రసంగే | ,, |
| ఆపద్విషయ అశక్తవిషయశ్చ | ,, |
| ఉపవేశనవిధిః | ,, |
| అర్చనాదివిధిః | ౫౯ |
| జానునిక్షేపవిధిః | ,, |
| పూజావిధిః | ,, |
| అర్ఘ్యసంయోజన పిండసం యోజనవిధిః | ,, |
| అర్ఘ్యసంయోజననే విభక్త్యు చ్చారణవిధిః | ౬౧ |
| అర్ఘ్యసంయోజనకాలే అగ్ని దానవిధిః | ,, |

| | పుటసంఖ్య. |
|---|---|
| గంధాదిదానే ప్రాచీనావీత విధిః | ,, |
| మధ్యేహస్తోదకదానధావేవిధిః | ,, |
| అగ్నౌకరణవిధిః | ౬౨ |
| అగ్నౌకరణాగ్నినిర్ణయః | ,, |
| విధురాదికర్తృత్వే | ౬౨ |
| అసన్నిహిత భార్యస్యాగ్నౌ కర్తృనిర్ణయః | ,, |
| అగ్నౌకరణ హోమప్రకారః | ౬౩ |
| ఆహుతిత్రయనిషేధా | ,, |
| ప్రేతాహుతే అగ్నినిర్ణయః | ,, |
| ప్రేతాహుతి హోమప్రకారః | ,, |
| సపిండీకరణే అన్నసూక్త నిషేధః | ,, |
| ఘృతపాత్రనిధానం | ౬౪ |
| చిత్రగుప్తబలనిషేధః | ,, |
| సువాసినీ భోజనవిధిః | ,, |
| పితృసూక్తనిషేధః | ,, |
| అపేక్షితదానాభావే నిషేధః | ,, |
| పిండదూషణే | ౬౫ |
| గ్రంథాంతరే | ,, |
| భోక్తృర్వమనే | ,, |
| మాసికాదిషువమనే | ౬౬ |
| సంక్రాంతి శ్రాద్ధాదిషువమనే | ,, |
| భోక్తౄణాం అన్యోన్యస్పర్శే | ,, |
| ఉచ్ఛిష్టసంపర్కే | ,, |

| | పుటసంఖ్య. |
|---|---|
| ఆద్యశ్రాద్ధేవమనవిధిః | ౬౭ |
| షోడశశ్రాద్ధేవమనవిధిః | ,, |
| వైతరణీగోదానవిధిః | ,, |
| దానప్రకార | ,, |
| స్వర్గపాథేయ శ్రాద్ధము | ,, |
| దక్షిణదానము | ౬౮ |
| సపిండీకరణే తర్పణవిధిః | ,, |
| ఉదకుంభవిధిః | ,, |
| మాసోదక కుంభవిధిః | ,, |
| శతైకోద్దిష్టాని | ,, |
| ప్రేతాహుతి శేషస్య అభోజ్యత్వం | ,, |
| కర్తృశ్రాద్ధశేషాన్నభోజనవిధిః | ,, |
| ఏకోద్దిష్టశ్రాద్ధశేషాన్న భోజననిషేధః | ,, |
| ఉపవాసే శ్రాద్ధశేషాన్న భోజననిషేధః | ,, |
| భిన్నగోత్రాణాం పితృశేష భోజననిషేధః | ౭౦ |
| గ్రంథాంతరే | ౭౦ |
| శూద్రస్య పితృశేషాన్నదాన నిషేధః | ,, |
| ఆశౌచమధ్యే ప్రాప్త ప్రత్యాబ్దికస్య తదనంతరం శూన్యతిథౌ నిషేధః | ,, |
| శూన్యతిథ్యనంతరదినే కర్తవ్యత్వవిధిః | ,, |
| సంవత్సర విమోక శ్రాద్ధవిధిః | ,, |
| సంవత్సర విమోక శ్రాద్ధం వినా ప్రథమాబ్దిక ఫలాభావః | ౭౧ |
| సూతకాదినా స్వకాలాతిక్రమే పునర్విమోకనిషేధః | ,, |
| వర్షాంతసాపిండ్యే ప్రథమాబ్దికవిధిః | ,, |
| సపిండీకరణానంతరం బ్రహ్మచార నియమాభావః | ,, |
| అనుమాసికవిధిః | ,, |
| త్రైపక్షిక మాసికవిధిః | ౭౨ |
| ఊనషాణ్మాసికవిధిః | ,, |
| ఊనాబ్దిక మాసికవిధిః | ,, |
| ఊనానాం వర్జకాలాః | ౭౩ |
| ఊనానాం వర్జనక్షత్రాణి | ,, |
| గ్రంథాంతరే | ,, |
| అనేకమాసికాతిక్రమణే | ,, |
| దేశాంతరగత భ్రాతౄణాం ప్రత్యాబ్దికానుమాసికామావాస్యావిధిః | ౭౪ |
| దుష్టపుత్రమరణే గృహత్యాగవిధిః | ,, |
| సపిండీకరణాత్పూర్వం శ్రాద్ధాంతరనిషేధః | ,, |

| | పుటసంఖ్య. |
|---|---|
| ,, త్వరం ఇతరశ్రాద్ధ కర్తృ వ్యత | ,, |
| పిండదానంవినా శ్రాద్ధకరణ నిషేధః | ,, |
| ఆశౌచమధ్యే ప్రత్యాబ్దికశ్రాద్ధవిధిః | ౭౫ |
| పితృమృతాశౌచమధ్యే మాతుః ప్రాప్తశ్రాద్ధవిధిః | ,, |
| మాతాశౌచమధ్యే పితుః ప్రత్యాబ్దికశ్రాద్ధవిధిః | ,, |
| శ్రాద్ధనిమంత్రితస్య గాయత్రీ జపసంఖ్య | ,, |
| సపిండీకరణాది శ్రాద్ధాదిషు భోక్తౄణాం మాస నిర్ణయః | ౭౬ |
| తిలతర్పణము | ,, |
| ద్విభార్యకస్య గర్భవపనవిధిః | ,, |
| అన్యకర్తృకశ్రాద్ధస్య అన్య కర్తృత్వ నిషేధః | ,, |
| కర్తృనష్టశ్రాద్ధవిధిః | ౭౭ |
| విశ్వేదేవతానామాని | ౭౭ |
| మాతామహ శ్రాద్ధవిధిః | ,, |
| మాతామహశ్రాద్ధస్య క్వచిదపవాదః | ,, |
| నాందీ కర్తృష్షాణ్మాసపర్యంతం శ్రాద్ధకర్తవ్యత్వవిధిః | ,, |

| | పుటసంఖ్య. |
|---|---|
| అనేకశ్రాద్ధసన్నిపాతే | ౭౮ |
| ఏకస్యైవ భిన్నసంబంధత్వే | ,, |
| గ్రహణే ఆశౌచస్నాతకాభావః | ౭౯ |
| గ్రహణే ప్రత్యాబ్దిక శ్రాద్ధవిధిః | ,, |
| శ్రాద్ధాంగతర్పణవిధిః | ,, |
| జీవపితృకస్య తర్పణనిషేధః | ౮౦ |
| పరేహని శ్రాద్ధాంగతర్పణవిధిః | ,, |
| ప్రత్యాబ్దిక కాలనిర్ణయః | ౮౧ |
| సపిండీకరణవిషయే కర్తృభార్యా రజస్వలావిధిః | ,, |
| ప్రత్యాబ్దికే కర్తృభార్యా రజస్వలావిధిః | ౮౨ |
| గర్భిణీ సంస్కారవిధిః | ,, |
| రజస్వలాసూతికయోస్సంస్కారవిధిః | ౮౩ |
| పాలాశవిధిః | ౮౪ |
| ఉదకక్రియావిధిః | ౮౫ |
| ఉదకక్రియాప్రకారః | ,, |
| అనుగమనవిధిః | ౮౬ |
| బ్రాహ్మణవ్యతిరిక్తానాం పృథక్చిత్యారోహణవిధిః | ,, |
| అనుగమననిషేధకాలాః | ,, |
| అనుగమనప్రకారః | ౮౭ |

పుటసంఖ్య. | పుటసంఖ్య.


అనుగమనే సంస్కారాది సపిం
డీకరణాంతకర్మణాంవిధిః ,,
దుర్మరణ ప్రాయశ్చిత్తవిధిః ,,
సంవత్సరమధ్యే సంస్కారః ౮౮
అశక్తవిషయం ౮౯
అకృతచూడవిషయం ,,
అనుపనీతవిషయం ,,
దుర్మరణే కృచ్ఛ్రప్రతినిధిః ,,
స్ఫోటకమృతవిధిః ౯౦
మాతామహశ్రాద్ధవిధిః ,,
అత్యబ్దసాపిండ్యవిధిః ,,
స్నాతకబ్రహ్మచారి అగ్ని
విధిః ౯౦
వ్యభిచారీత్యాగః ౯౧
సుమంగలీ విధవా విషయం ౯౧
రజస్వలాకర్తృకస్నానదిన
విమోకశ్రాద్ధవిషయః ,,
మంత్రోచ్చారణవిధిః ,,
సకృదాచ్ఛిన్న ప్రమాణము ,,
విభక్తవిషయః ,,
ఏకదినేక్షుర కర్మవర్జనము ,,
దూరదేశగత బహుకాలాను
గత విషయము ,,
ఉత్క్రమసాపిండ్యే విశేషః ,,
సపిండీకరణకాలః ౯౪
దేశాంతరజ్ఞాతినాం తిలోదక
విధిః ,,
నామ్నో వేదనే నామగ్రహ
ణము ,,
ఆశౌచే సంధ్యావందనవిధిః ,,
శ్రాద్ధేవిషనాడికా దోషా
భావః ,,
వివాహమధ్యేవరస్యమాతా
పిత్రోరేకమృతిర్విధిః ౯౫
శ్రాద్ధస్థల నిరూపణం ,,
కర్మాచరణఫలము ౯౬


—* శ్రాద్ధ ప్రకరణము. *—


శ్రాద్ధశబ్దార్థః ౯౭
శ్రాద్ధకాలాః ,,
వ్యతీపాతలక్షణము ,,
అష్టకశ్రాద్ధలక్షణము ,,
,, వృద్ధి ,, ౯౮
సంక్రమణ లక్షణము ,,
అయన ,,
వ్యతీపాతనామ ,,
గజచ్ఛాయ లక్షణము ,,
గ్రహణేశ్రాద్ధస్య కాలవిశేషః ,,
యుగాదినిర్ణయః ౯౯
మన్వాది ,,
మహాలయపక్షనిర్ణయః ,,
గ్రంథాంతరే ౧౦౦
సూతకానంతర శ్రాద్ధ

| పుటసంఖ్య. | | పుటసంఖ్య. | |
|---|---|---|---|
| నిర్ణయః | ,, | నియమాః | ,, |
| దేశాంతరస్థిత కర్తృశ్రాద్ధ విధిః | ,, | శ్రాద్ధాంగతర్పణవిధిః | ,, |
| రజస్వలాకర్తృకశ్రాద్ధ విధిః | ౧౦౧ | మహాలయ | ౧౦౬ |
| శ్రాద్ధజభోజనీయబ్రాహ్మణ పరీక్ష | ,, | పితృవ్యాదికారుణ్యశ్రాద్ధేషు తర్పణవిధిః | ,, |
| శ్రాద్ధభోజనీయాః | ,, | జీవపితృకస్య మాతుశ్శ్రాద్ధే తర్పణవిధిః | ౧౦౬ |
| శ్రాద్ధేవర్జనీయాః | ,, | సపిండీకరణానుమాసికాదిషు | ,, |
| గ్రంథాంతరే | ౧౦౨ | శ్రాద్ధదినే బ్రహ్మయజ్ఞాది విధిః | ౧౦౭ |
| విశేషమాహ | ,, | సంకల్పశ్రాద్ధవిధిః | ,, |
| గ్రంథాంతరే శ్రాద్ధభోజనీయాః | | విభక్తిలింగజ్ఞానే | ,, |
| అనేకశ్రాద్ధసన్నిపాతే | ,, | మహాలయే అపుత్రాణాం సపుత్రాణాంచ శ్రాద్ధవిధిః | ,, |
| నిమంత్రితకాలః | ౧౦౩ | మాతౄణాం బహుత్వేవిధిః | ,, |
| నిమంత్రణప్రకారః | ,, | తక్రదాన నిషేధః | ,, |
| బ్రాహ్మణసంఖ్య | ,, | —* ఆశౌచప్రకరణం. *— | |
| అతీతనిమంత్రితః | ౧౦౪ | జాతసూతక ప్రకరణము. | |
| నిమంత్రణ బ్రాహ్మణపరిత్యాగదోషః | ,, | జాతసూతకము | ౧౦౮ |
| నిమంత్రతస్య శ్రాద్ధకాలాతిక్రమణే | ,, | ప్రసూతివిధిః | ,, |
| దక్షిణదానము | ,, | సావప్రసూతివిధిః | ,, |
| శ్రాద్ధశేషాన్నభోజనవిధిః | ౧౦౫ | ప్రసూతివిషయః | ౧౦౯ |
| ఏకాదస్యుపవాసాదినియమే | ,, | గర్భపాతాశౌచవిధిః | ,, |
| శ్రాద్ధదినేకర్తృభోక్తృ | | గర్భస్రావాశౌచవిధిః | ,, |
| | | నాభిచ్ఛేదనాత్పూర్వం శిశు | |



శ్రీరస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

శ్రీ ఆపస్తంబమహర్షిభ్యోనమః.

# అపరసిద్ధాంతము.

## పైతృమేధికప్రకరణము.

శ్లో ॥ ఓంనమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైక మూర్తయే ।
నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయేనమః ॥

శ్లో ॥ ఆపస్తంబమునింవందే యత్ప్రసాదాదమీవయమ్ ।
స్వర్గాది మోక్షపర్యంతాం వైదికీం సిద్ధిమాప్నుమః ॥

—*—

—* తిథివిషయః. *—

స్మృతిరత్నాకరే ॥ శ్లో ॥ ఉత్పత్తౌచవిపత్తౌచ మైధునే దంతధావనే । అభ్యంగేప్యుదధిస్నానే తిథిస్తాత్కాలికీ స్మృతౌ ॥ *

తాత్పర్యము ॥ జననమందును, మరణమందును, గర్భాదానమందును, స్నాతకవ్రతమందును, అభ్యంగనస్నానమందును, సముద్రస్నానమందును, తత్కాలమున ఏతిథి ఘడియలు వ్యాపించియున్నదో ఆతిధినే సంకల్పమున చెప్పవలయునని స్మృతిరత్నాకరమను గ్రంథమున చెప్పబడి యున్నది.

గ్రంథాంతరమున ॥ దహనము, సంచయనము, నగ్నశ్రాద్ధము, శిలాప్రతిష్ఠ, నిత్యకర్మ, నవశ్రాద్ధములు, దశాహతంత్రములు, పుణ్యాహవాచనము, వృషోత్సర్జనము, ఏకోద్దిష్టము, షోడశము, సపిండీకరణము, శాతకుంభశ్రాద్ధము, ఈకార్యములందు తిథిద్వయ

మైనప్పటికిని, శూన్యతిథియైనను తత్కాలమున ఏతిథిఘడియలు వ్యాపించియున్నదో యాతిథినే సంకల్పమున చెప్పుకొనవలసినది.

—*—

## —* రాత్రినిర్ణయః. *—

మృతియందు రాత్రిని మూడుభాగములుగ చేసి మొదటిరెండు భాగములు అనగా ౨౦ ఘడియలలోపల మృతినొందిన పూర్వదినముగనే లెక్కచేసికొనవలయును. ౨౦ ఘడియలమీద మరణించిన మరుదినముగ లెక్కచేయవలయును.

—*—

## —* అయన నిర్ణయః. *—

ఉత్తరాయణమున మృతినొందువానికి శ్రేష్ఠమైన స్వర్గలోకసుఖము కలుగునని చెప్పబడియున్నది.

—*—

## —* పక్షనిర్ణయః. *—

శుక్లపక్షమున పగలు, కృష్ణపక్షమున మధ్యాహ్నము, ఉభయపక్షములలో ఏకాదశి, ఈకాలముల మృతినొందువానికి మోక్షము కలుగునని మార్కండేయులువారు చెప్పియున్నారు.

—*—

## —* మృతికి దోషములు. *—

మృతినొందు కాలమును అనుసరించి కొన్నిదోషములు కలుగుచున్నవి. ఇట్టిదోషములు పరిహారమగుటకు శాంతి హోమములు దానములు శాస్త్రమున చెప్పబడియున్నది. ఇట్టికాలముల మరణించిన యాపరిహార శాంతి హోమాదుల చేయవలయును. ఈదోషములగు కాలములను అవి పరిహారమగుటకు చేయవలసిన శాంతులను ఈదిగువ వివరముగా వ్రాయబడియున్నవి.

—*—

## —* భద్రతిథిః. *—

శుక్లపక్షమునను కృష్ణపక్షమునను, విదియ, సప్తమి, ద్వాదశి

తిధులు భద్రతిథులని యనబడుచున్నవి. ఈతిధులయందు మృతినొం దిన కలుగుదోషము పరిహారమగుటకొఱకు భూదానమును చేయవల సినది. లేనిపక్షమున హిరణ్యదానమునైనను చేయవలయును.

—*—

## * నందతిధిః. *

శుక్లపక్షమున ౧- ౬- ౧౧ - కృష్ణపక్షమున ౧ - ౬ - ౧౧ నందతిథులు. ఈతిధులయందు మృతినొందినవారికొఱకు ధాన్యదాన ము చేయవలయును.

—*—

## * రిక్తతిధిః. *

అనగా శుక్లపక్ష ౪- ౯- ౧౪ కృష్ణపక్ష ౪-౯- ౧౪ ఈతిధు లలో మరణించిన ధాన్యదానమే చేయవలయును.

—*—

## * వారనిర్ణయః. *

భానువారము, మంగళవారము, శుక్రవారము, శనివారము, ఈవారముల మృతినొందిన దోషము కలుగుచున్నది. ఈదోషము పరి హారమగుటకుగాను వస్త్రదానమును ఇవ్వవలయును.

—*—

## * ద్విపాద నక్షత్రాణి. *

మృగశిర, చిత్త, ధనిష్ఠా ఈనక్షత్రములు ద్విపాద నక్షత్ర ములు. ఈనక్షత్రములలో మృతినొందిన యాస్థలమును రెండుమాస ములు వదలిపెట్టవలయును. లేనియెడల శౌనకులవారు చెప్పిన ప్రకా రము నక్షత్రశాంతిహోమమును స్వర్ణదానమును చేయవలయును.

—*—

## * త్రిపాద నక్షత్రాణి. *

కృత్తిక- పునర్వసు - ఉత్తర- విశాఖ - ఉత్తరాషాఢా - పూ ర్వాభాద్ర- త్రిపాదనక్షత్రములు. ఈ నక్షత్రములలో మరణించిన యాస్థలమును మూడుమాసముల వఱకును వదలవలయును. లేకపో

యిన నక్షత్రహోమమును హిరణ్యసహితమైన వస్త్రమును దానము ఇవ్వవలయును.

—*—

### —*ధనిష్ఠాపంచకనక్షత్రాణి.*—

ధనిష్ఠా, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములలో మృతినొందిన ఆస్థలమును ఆరు మాసములవరకు వదలవలయును. లేనిపక్షమున పదుమూడవదినమున శాంతి సారావళి సారమను గ్రంథమున వ్రాయబడిన రీతిగ ఆయానక్షత్రమునకు అష్టోవాక్యమంత్రముచేత ౧౦౮ మారులు హోమముచేసి పిమ్మట ౮౧ ఫలములుగాని, ౪౦ ఫలములుగాని ౨౦ ఫలములుగాని, ౯ ఫలములు గాని, ౬ ఫలములుగాని, ౩ ఫలములుగాని ఎత్తుగల కాంస్యపాత్రను పాలుతోకూడ దాన మివ్వవలయును. ఇట్లుచేయుటచే దోషము పరిహారమగుటయేగాక యజమానుని వంశము వృద్ధిబొందును.

మఖ, రోహిణి, ఈ రెండు నక్షత్రములలో మరణించిన ఆస్థలము ను ఒకమాసము వదలవలయును. నక్షత్ర శాంతిహోమమును స్వర్ణ దానమును చేయవచ్చును.

ద్విపుష్కర త్రిపుష్కర యోగములు ఆచారమందున లేదు గనుక ఈగ్రంథమున వ్రాయబడలేదు.

—*—

### —*మరణానంతరం కర్తృనిరూపణము.*—

బ్రహ్మాండపురాణే, యజ్ఞాజీయే. — పుత్రుడు, మనముడు, మునిమనముడు, కుమార్తె, దౌహిత్రుడు, భార్య, అన్న, అన్న కుమారుడు, తండ్రి, తల్లి, కోడలు, తోబుట్టు, మేనల్లుడు, జ్ఞాతులు, ద్రవ్యమును తీసికొనినవాడు, వీరుకర్తలు. వీరిలో నెవ్వరు మృతినొందినవాని సన్నిధిలోయుందురో వారే దహనాది సంస్కారములను చేయవలసినవారు. వీరెవ్వరును లేని అప్పుడు రాజు, గురువు, శిష్యులు, స్నేహితులు, పురోహితులు దహనాది సంస్కారముల చేయవచ్చును.

## —* బ్రహ్మచారి కర్తృ నిరూపణము. *—

తల్లి దండ్రులకు, ఆచార్యునికి, అన్నదమ్ములకు, అగ్ని సంస్కారము మొదలగు కర్మను బ్రహ్మచారి చేయవచ్చును. ౧౦ దినములు ఆశౌచము ఉండి కర్మను చేయవలసినది. ఎవ్వరు లేని పక్షమున జ్ఞాతులకును, సపిండులకు దహనము మొదలు సపిండీకరణము వరకు కర్మను చేయవలయును. బ్రహ్మచారి సూతకాన్నమును భక్షింపగూడదు. అన్యులకు కర్మచేసిన పునః ఉపనయనము చేసికొనవలయును.

—*—

## —* బహుపుత్రత్వే జ్యేష్ఠస్యైవ కర్తృత్వవిధిః *—

మృతినొందినవానికి అనేక పుత్రులు ఉన్నయెడల జ్యేష్ఠుఁడు తమ్ముల అనుమతినివడసి తమ్ములతో సహా మాతాపితృలకు కర్మను క్రమముగా చేయవలయును. జ్యేష్ఠుఁడుసాన్నిధ్యమున లేకపోయిన కనిష్ఠులు కర్మచేయవలసినది. జ్యేష్ఠుఁడు రోగముచేత నశక్తుఁడు అగునప్పుడు కనిష్ఠులు దహనాది కార్యములు ఆచరింపవలయును.

—*—

## —* దేశాంతరముననుండు జ్యేష్ఠుఁడు చేయువిధి. *—

తల్లిదండ్రుల మరణము తెలిసినంతనే క్షౌరముచేసికొని ఆదినము మొదలు ౧౦ రోజులు ఆశౌచము ఉండి తిలోదకమును దర్భకూర్చమీద ప్రతిదినము సంఖ్యాప్రకారమువిడిచి ౧౧ వ దినమున ప్రేతశబ్దము లేక వసురుద్రాదిత్య రూపముచేత సపిండీకరణము మాత్రము చేయవలసినది. వైతరణీగోదానము స్వర్గపాథేయము చేయవలసినదిలేదు.

—*—

## —{ దేశాంతరస్థితుఁడగు జ్యేష్ఠుఁడు సంచయనాత్పూర్వము వచ్చిన. }—

సంచయనమునకు ముందు దేశాంతరముననుండు జ్యేష్ఠుఁడు వచ్చిన దహనము వినాహా సంచయనము మొదలుగాగల కర్మను యథావిధిగా తమ్ములతోసహా చేయవలయును. సంచయనమైన తరు

వాత వచ్చిన క్రొత్తవస్త్రమును, బద్దెయున్ను తీసికొని సమస్తకర్మను చేయువలసినది.

—*—

———* దశాహమధ్యే దేశాంతరస్థిత కనిష్ఠకర్తవ్యం. *———

తల్లిదండ్రులు మృతినొందిన తర్వాత ౧౦ దినములలోపల దేశాంతరమున నుండిన కనిష్ఠుడు వచ్చిన కర్మను చేయు జ్యేష్ఠునితో కూడుకొని ప్రాజాపత్యకృచ్ఛ్రములు చేసి గతించినదినము మొదలుకొని తిలోదక వాసోదకములను విడిచి యథావిధిగా జ్యేష్ఠునితోకూడా కర్మ చేయువలయును. పిండము పెట్టవలసినదిమాత్రము పనిలేదు.

—*—

———* దశాహానంతరం దేశాంతరస్థిత కనిష్ఠకర్తవ్యం. *———

తల్లిదండ్రుల మరణమును ౧౦ రోజుల తరువాత దేశాంతరముననుండు కనిష్ఠుడువినిన క్షౌరము చేసికొని యాదినము మొదలు ౧౦ దినములు ఆశౌచము ఉండి ప్రతిదినమును దర్భకూర్చమీద సంఖ్యాప్రకారము తిలోదకమును విడిచి ౧౦ దినమున క్షౌరము చేసికొని ౧౧ వ దినమున పార్వణశ్రాద్ధమును చేయువలయును. జ్యేష్ఠుడు యథావిధిగా కర్మనుచేయుచున్నాడు గనుక ఇతడీమాదిరి చేయవలయును.

—*—

———* గౌణకర్తృత్వవిధిః. *———

మృతినొందినవాని సాన్నిధ్యమున పుత్రులు లేనియెడల పితామహుడు, దౌహిత్రుడు, అల్లుడు, కొమార్తె, అన్నదమ్ములు, మేనమామ, శిష్యుడు, ఆచార్యుడు, స్నేహితుడు వీరిలో ఎవ్వరైన తిలోద్వాసనమువరకు కర్మను చేయవచ్చును కాని, ఈవిషయమున దేశాచారమును అనుసరించి చేయువలయును. పైజెప్పిన వారెవ్వరు లేనప్పుడు రాజుగాని ఇతరులెవ్వరేని దహనసంచయనములు మాత్రము చేయవలయును.

మరియొక విశేషము గలదు. పుత్రులు సన్నిధానమున లేన

ప్పుడు పితృసపిండులును, మాతృసపిండులును, శిష్యులును, ఋత్విక్కులును, ఆచార్యుఁడును, అసగోత్రుఁడును, సగోత్రుఁడును, స్త్రీగాని పురుషుఁడుగాని దహన సంచయనములు చేయవచ్చును.

—*—

## * సంవత్సరమధ్యే దేశాంతరస్థిత పుత్రకర్తవ్యం. *

దహనసంచయనములు తప్ప తిలోదకము మొదలుగా కలిగిన కర్మను యథావిధిగా చేయవలెనని గ్రంథమున చెప్పబడి యున్నది. మూడుపక్షములకు లోపల దినవారశుద్ధిచూడకనే కర్మ నారంభించవచ్చును. మీద అయిన దినవారశుద్ధి చూచి కర్మచేయవలయును.

—*—

## దేశాంతరముననుండు పుత్రులు మాతాపితృ మరణము వినిన.

మృతినొందిన సంగతి వినినంతనే క్షౌరముచేసికొని పాలాశవిధిగా దహనము మొదలుగాగల కర్మను యథావిధిగా చేయవలయును. అస్థులున్నయెడల పాలాశ విధిగా చేయనక్కరలేదు. అస్థులనే పునఃదహనముచేసి కర్మను చేయవలెను. సంవత్సరమునకు మీద వినిన ఉదకక్రియగా చేయవలెను.

—*—

## * సంచయనానంతరం దేశాంతరస్థిత పుత్రకర్తవ్యం. *

పుత్రులు సాన్నిధ్యమున లేక సంచయనము జరిగినతరువాత వచ్చిన దహనసంచయనము మంత్రవృత్తిగా జరిగి ఉండినట్లైన అవితప్ప శిలాప్రతిష్ఠ మొదలుకొని కర్మను యథావిధిగా చేయవలయును.

—*—

## * అనుపనీతకస్య కర్తృత్వవిధిః. *

మరణించిన వాని పుత్రుఁడు అనుపనీతుఁడుగా ఉన్నప్పుడు ఇతరులెవ్వరైనను అనుపనీతునివలన అనుజ్ఞ తీసికొని పైతృమేధిక కర్మను శాస్త్రోక్తముగా దహనము మొదలు చేయవలసినది.

—*—

—* స్వీకారానంతరం పుత్రజననే కర్తవ్యం. *—

స్వీకారము తీసికొనిన తర్వాత తన గర్భవాసమున పుత్రుఁడు గలిగిన తనపుత్రుఁడు జ్యేష్ఠునివిధముగాను దత్తపుత్రుఁడు కనిష్ఠుని విధముగ పితృకర్మను చేయవలసినది.

—*—

—* కౌమారుడు మూగవాడైన చేయువిధిః. *—

మరణించినవాని పుత్రులు మూగవారుగాని పిచ్చివారుగాని యైనప్పుడు వార్లయనుజ్ఞనుపొంది ఇతరులు కర్మను చేయవలసినది.

—*—

—* పుత్రహీనయగు స్త్రీకి కర్తృనిర్ణయః. *—

చనిపోయిన స్త్రీకి పుత్రులు లేనప్పుడు భర్తకర్మను చేయవలసినది. సవతిపుత్రులు ఉన్నప్పటికిని భర్తనే చేయవలయునని గ్రంథమున చెప్పియున్నను ఈవిషయమున దేశాచారమును వృద్ధాచారమును అనుసరించి చేయవలసినది.

—*—

—* జీవపితృకస్య కర్తృత్వవిధిః. *—

జ్యేష్ఠుఁడు చనిపోయిన సన్నిహితుఁడు తమ్ముఁడు జీవపితృఁడు అయినప్పటికిని వాడే కర్మను చేయవలసినది.

—*—

—* పుత్రానుజమరణే కర్తృత్వవిధినిషేధా. *—

తండ్రి కౌమారునికి కర్మచేయుకూడదు. జ్యేష్ఠుఁడు కనిష్ఠునికి కర్మనుచేయురాదు. కాని మరియెవ్వరు కర్తలు లేనప్పుడు తండ్రియే కుమారునికిని, జ్యేష్ఠుఁడు తన తమ్మునికిని కర్మను చేయవలసినది.

—*—

—* రజస్వలాకర్తృక భర్తృదహన నిషేధః. *—

దైవవశాత్తుగా భర్త చనిపోయినప్పుడు భార్య రజస్వలయై యుండి అదియేకర్త అయినప్పుడు అమంత్రవత్తుగా దహనముచేయవలయును. అనుజ్ఞనుపొందికూడా ఇతరులు మంత్రావృత్తిగా చేయ

గూడదు. స్నానదినమందు భర్త మృతినొందినను అమంత్రవత్తుగానే దహనముచేసి అయిదవ దినమునందు యథావిధిగా దహనాది కృత్యముల చేయవలయును. దహనమైన తర్వాత రజస్వలైన సంచయనము నిలుపగూడదు.

—※—

——* శుద్ధివిషయః. *——

గ్రహణమునకు మఱుదినమును, జాతాశౌచమునకు ౧౧ వ దినమునను, మృతాశౌచమునకు ౧౩ వ దినమునను, రజస్వలయందు అయిదవ దినమును శుద్ధియని తెలిసికొనవలయును.

—※—

——* దేశాంతరస్థిత కర్తృనిర్ణయః. *——

చనిపోయినవారి సాన్నిధ్యమున ముఖ్యకర్తలు లేనప్పు డెట్లు చేయవలయుననిన, ౧౦ యోజనములలో నుండిన వారి కర్తవ్యముచే ఇతరులు మంత్రావృత్తిగా దహనసంచయనములు మాత్రము చేయవచ్చును. అని గ్రంథాంతరమున చెప్పబడియున్నది కాని, ఈవిషయమున దేశాచారమెట్లో యాప్రకారముగానే చేయవలయును.

—※—

——* ప్రథమదినే వపనవిధిః. *——

తల్లిదండ్రులు, పితామహిమాతామహులు,పినతండ్రి,పెత్తండ్రులు, మేనమామ, అన్న, మామగారు, ఆచార్యుడు, వీరిభార్యలు, మేనత్త,అక్క,మాతామహి,మాతామహుడు, సాపత్నిమాతృ, జనకతల్లిదండ్రులు వీరు మృతినొంది స్వకర్తృత్వము వచ్చినప్పుడు దహనానంతరము వపనము చేసికొనవలయును. భార్య గర్భవతి అయియున్నప్పటికి చేసికొనవలసినదే.

—※—

——* గ్రంథాంతరే వపనవిధిః. *——

తల్లిదండ్రులు, అన్న, మాతామహుడు, మాతామహి, సాపత్నిమాతృవీర్లు మృతినొందినప్పుడే గర్భిణీపతిగా నున్నప్పటికిని

క్షౌరము చేసికొనవలయును. కాని, తదేతురుల మృతియందు స్వక ర్తృత్వము ప్రాప్తించినను వపనము చేసికొనవలసినది పనిలేదు.

—*—

—— * జ్ఞాతివపనవిధిః. * ——

పుత్ర జననమందును, మరణమున స్వకర్తృత్వము గలిగినప్పుడు కర్త ౧౦ వ దినమున వపనము చేసికొనవలయును. జ్ఞాతులు సహితము ౧౦ వ దినముననే చేసికొనవలయును. తల్లి దండ్రి మరణమునందు అనుపనీతుడు పుత్రుండు ౨ సంవత్సరముల ఈడుగలవాడైన చేసికొనకూడదు. ౩ సంవత్సరముల వాడైనది మొదలు క్షౌరము చేసికొనవలయును.

—*—

—— * అన్నకుమారుని వపనవిధిః. * ——

పినతండ్రికుమారుండు వయస్సున పెద్దవాండుగనుండి చనిపోయిన తాను వయస్సున చిన్నవాడైనను వపనము చేసికొనరాదు.

—*—

—— * జీవపితృకస్యవపనాది నిషేధః. * ——

జీవపితృండు జ్ఞాతులతోకూడా క్షౌరము చేసికొని తిలోదకము విడువరాదు. గర్భిణీపతియును జ్ఞాతి మరణమున క్షౌరతిలోదకముల చేయరాదు. జీవపితృండు అన్నమృతియందు క్షౌరము చేసికొనవలయునని గ్రంథమున చెప్పియున్నను దేశాచారప్రకారము చేయవలయును.

—*—

—— * కర్త్రావపనవిధిః. * ——

మరణదినమున కంఠమువఱకును ౧౦ వ దినమున సర్వాంగమును వపనము చేసికొనవలసినది. చిన్నవారు మరణించిన కర్తక్షౌరము చేసికొనగూడదు. కర్మమాత్రము చేయవలయును.

—*—

## —* ఆశ్వలాయన క్షౌరవిధిః. *—

పుత్రులు లేనప్పుడు మనముడు, మునుమనుముడు, దౌహిత్రుడు వీరుమాత్రము వపనము చేసికొని కర్మ ఆరంభముచేయవలసినది. దహనాత్పూర్వమే ఆశ్వలాయనులు క్షౌరము చేసికొనవలసినది. ప్రథమదినమున పుత్రులును, జ్ఞాతులు ౧౦ వ దినమునందున క్షౌరము చేసికొనవలయును. ౧౧ వ దినమున నవశ్రాద్ధము లేదు. శవమును స్మశానమువరకు తీసికొని పోవునపుడు మార్గమధ్యమున పథిపిండము లేదు. సంచయనహోమము చేయనక్కరలేదు. దశాహహోమము చేయుబనిలేదు, కర్త ౧౦ వ దినమున వపనము చేసికొనవలయునని గ్రంథమున చెప్పియున్నను దేశాచారప్రకారము నడుచుకొనవలయును.

—*—

## —* విభక్తకర్తృత్వ విషయః. *—

మృతినొందినవాడు పుత్రహీనుడై అన్నదమ్ములు లేక పోయి నటువంటివాడైన వానికి భార్యయే కర్మచేయవలసినది. ఈప్రకారమే భార్యకు భర్తయే కర్మ చేయవలయును. ఇతరులు చేయరాదు.

—*—

## —* రాత్రౌవపనవిధిః. *—

మాతాపితృలకు సూర్యుడస్తమించకమునుపే పైతృమేధిక కర్మను ఆరంభించి రాత్రి రెండు ఝాములలోపల దహనమైనయప్పుడే కర్త క్షౌరము చేసికొనవలసినది. మాతాపితృలకు తప్ప ఇతరులకు రాత్రి దహనమైనపుడు మరుదినమున ఉదయముననే క్షౌరము చేసికొనవలయునని గ్రంథమున జెప్పబడియున్నను ఆచార ప్రకారము చేయుటయే యుచితము.

—*—

## —* ఉత్క్రాంతివిధిః. *—

ప్రాణములు దుర్బలము కలుగగానే స్నానముచేయించి పరిశుద్ధమైన వస్త్రముకప్పి దక్షిణ శిరస్సుగా దర్భలు పరచిన భూమి

యందు పంచకలోహమెట్టవలసినది. పరిశుద్ధమైన వస్త్రమును యజ్ఞోప వీతముగా వేసి నెయ్యి శరీరము యావత్తున్ను పూసి మంచి పుష్పము లచే అలంకరించి చెవులయందునను, నేత్రములయందునను, ముఖ మందునను, ఘ్రాణరంధ్రములయందనను, సువర్ణ శకలములనుంచి తండ్రిచే సంపాదింపబడిన పాపము నివృత్తికొరకు పుత్రుడు దూడ సహితమైన గోవును దానము ఇవ్వవలయును. దశదానములను చేయ వలయును.

—※—

## —※ తిలపాత్రదానవిధిః. ※—

జన్మప్రభృతి ఏతత్క్షణ పర్యంతరము సంపాదింపబడిన పాపము నివృత్తియగుటకు రాగిపాత్రలో అరపడినూగులు పోసి దానము చేయవలయును. ఈ ప్రకారము చేసిన తండ్రి సద్గతిని బొందుచు న్నాడు.

—※—

## —※ కర్ణమంత్రపఠనవిధిః. ※—

చనిపోయినవాని కుడిచెవియందు పుణ్యమంత్రములను చెప్ప వలయును. ఈవిధమున చెప్పిన వాడు పాపములబాసి పుణ్యలోక మును బొందుచున్నాడు.

—※—

## —※ షణ్నిమిత్త ప్రాయశ్చిత్తవిధిః. ※—

ఊర్ధ్వోచ్ఛిష్టము, అధోచ్ఛిష్టము, అంతరిక్షమరణము, ఆశౌచ మరణము, ఖట్వాదిమరణము, చండాలశ్వపచాదులచే కలిగిన మర ణము— ఈ ఆరువిధములైన మరణములు కలిగిన విప్రవాక్యాను సారముగా స్మృతులయందు చెప్పబడిన ప్రాయశ్చిత్త విధిప్రకా రము ప్రాజాపత్య కృచ్ఛ్రములను చేయవలయును.

—※—

## —※ పర్యుషిత శవదహనేదోషః. ※—

పర్యుషిత శవమనగా, ఒకపగులు ఒకరాత్రి దహనము చేయ

బడక ఉండు శవము. దీనికి ప్రాయశ్చిత్తమేమనిన, పంచగవ్యముచే స్నానముగావించి ప్రాజాపత్య కృచ్ఛ్రములను చేయవలసినది. ఆశవమునకు దుర్వాసన కలిగినప్పుడు గోమూత్రముచే శుద్ధిపఱిచి సప్త కృచ్ఛ్ర ములనుచేయుట ఆశవమునకు పురుగులు పట్టిన నెయ్యిచేతను తేనెచేతను దానిని శుద్ధచేసి శుద్ధోదకముచే స్నానముగావించి గోదానమొసంగి తప్తకృచ్ఛ్రములచేసి దహనము చేయవలయును.

—*—

## —* అగ్నినిర్ణయః - అనాహితాగ్ని విషయః. *—

లౌకికాగ్ని తీసికొనివచ్చి ప్రతిష్ఠచేసి "ఉపావరోహ" అను మంత్రముచేత ప్రేతచేతియందుంచి సమిత్తును తీసికొనివచ్చి అగ్నియందుంచి చతుష్పాత్ర ప్రయోగముచేసి ఆజ్యమును దర్వియందు ౧౨ ఆవర్తులు తీసికొని మంత్రము లేకుండ హోమము చేయవలసినది. అటుపిమ్మట ప్రేతౌపసనము చేయవలసినది. తండులాహుతి ౧ ఆహుతియే చేయవలసినది. మంత్రముచెప్పబనిలేదు. పగటియందు మృతినొందిన ప్రాతరాహుతియు, రాత్రియందు అయిన మరుదినము సాయమాహుతి చేయవలయును. ఇది అవుపాసనాగ్నివిధి.

—*—

## —* ఉత్తపనాగ్ని విషయము. *—

అపత్నీకుఁడుగాని, విధవగాని మృతినొందిన ఉత్తపనాగ్నినియందు సంస్కారము చేయవలయును. మూడుపిడికెళ్ళ ప్రమాణముగాగల దర్భను తీసికొని, మూడుకట్టలుగా కట్టి, అందులో మొదటి కట్టను లౌకికాగ్నియందు జ్వాలచేయవలయును. ఆజ్వాలయందున రెండవ దర్భకట్టను జ్వాలచేసికొని మొదటికట్టను వదలివేయవలయును. ఆరెండవకట్ట జ్వాలలో ౩ వ కట్టను జ్వలనముచేసికొని ౨ వ కట్టను వదలి ౩ వ కట్టయందున్న అగ్నినిదృఢపఱిచి, ఆజ్యసంస్కారముచేసి, ౧౨ ఆవర్తులు ఆజ్యమును తూష్ణీముగా ఆ అగ్నియందు హోమము చేయవలయును.

—*—

—* కపాలాగ్ని విషయము. *—

యతి, బ్రహ్మచారుల మరణమున కపాలాగ్నియందు సంస్కారము చేయవలయును. ఒకకుండను అగ్నియందు చక్కగ కాలిచి, దానియందు పొట్టు, పిడకలువేసి, అగ్నిని కలుగచేసి, యా అగ్నిని తీసికొని, దానియందున ఆజ్య సంస్కారమునుజేసి, దర్వియందు ౧౨ ఆవర్తులు ఆజ్యమును గ్రహించి తూష్ణీముగా హోమము చేయవలయును.

—*—

—* అనుపనీత సంస్కారవిధిః. *—

అనుపనీతుఁడు, కన్యక, వీరు ౩ సంవత్సరముల వయస్సుగలవారైనది మొదలు దహనము చేయవలయును. గ్రంథాంతరమున ౫ వ సంవత్సరమునుండియే దహనమొనరింపవలసినదని ఉన్నది. ఇట్టి విషయమున దేశాచారమును నాచరింపవలయును. వీరికి సంస్కారవిధి ఎట్లనిన,— లౌకికాగ్నిచే అస్మాత్వమధి మంత్రముచేత దహనము చేయవలసినది.

—*—

—* వివాహిత ద్వివర్ష కన్యా మరణే. *—

వివాహిత అయిన ౨ సంవత్సరముల ప్రాయము గల కన్య మృతినొందిన ఒకఝాము ఖననముచేసి ఉంచి అటుతర్వాత శాస్త్రోక్తముగా అవుపాసనాగ్నిచే సంస్కారము చేయవలయును.

—*—

—{ కన్యాదానాత్పరం ప్రధాన హోమాత్పూర్వం వధూవరో రగ్నినిర్ణయః. }—

కన్యాదానమై ప్రధానహోమము గాకమునుపు వరుడు మరణించిన దేవాలయాగ్నిచే దహనము చేయవలయును. కన్య మృతినొందిన నాలుగు గృహములనుండి యగ్నిని తీసికొని దానియందు పైతృమేధిక హోమముమొదలు కర్మను యథావిధిగా జరుపవలయును.

తండ్రి దేశాంతరముననుండ తల్లి మృతినొందిన పుత్రుఁడు లౌకికాగ్నియందు ప్రేతాధానమును చేసి దహనము చేయవలయును.

తల్లి దేశాంతరముననుండ తండ్రి మరణించిన పుత్రుఁడు అగ్నిసంధానముచేసి శాస్త్రోక్తముగా కర్మ చేయవలయును.

పుత్రుఁడు దేశాంతరమున నుండునప్పుడు తల్లిదండ్రులు ఒకచోటనుండిన వీరిలో తండ్రి మృతినొందితే తల్లియు, తల్లి మృతినొందితే తండ్రియు ప్రేతాధానవిధిగా అగ్నిసంస్కారము చేయవలసినది.

—*—

## *యతిభార్యా మరణే.*

యతిభార్య సుమంగలిగా మరణించిన ఉత్తపనాగ్ని సంధానముచేసి ప్రేతౌపసన పూర్వకముగా దహనము చేయవలయును.

—*—

## *ద్విభార్యాఽగ్ని నిర్ణయః.*

ఇద్దఱు భార్యలు గలవానికి ఒకభార్యమృతినొందిన ప్రత్యేకమైన ఔపాసనాగ్నిని రెండు భాగములుగా చేసి, యీరెండు భాగములందు "అగ్నయేపిచమేస్వాహా" యను మంత్రముచే ప్రత్యేకముగా ఆజ్యాహుతి హోమము చేసి, జ్యేష్ఠభార్య మరణించిన దక్షిణభాగమందున్న అగ్నిచేతను, ద్వితీయభార్య కాలమైనప్పుడు ఉత్తరభాగమందున్న అగ్నిచేతను దహింపవలయును. శేషించిన భాగమును సమిత్సమారోపణగాని, ఆత్మసమారోపణగాని చేసికొనవలసినది. అనేకభార్యలున్నప్పుడు జ్యేష్ఠభార్యను దక్షిణ భాగమందుండు అగ్నిచేతను, శేషించిన భార్యలెవ్వరు చనిపోయినను ఉత్తరభాగమందున్న అగ్నిచేతను దహింపవలయును.

—*—

## *ఏకకాలే ద్విభార్యా మరణే.*

ఏకకాలమున ఇద్దఱు భార్యలు మృతినొందిన అవుపాసనా

గ్నిని రెండు భాగములు మంత్రములేక చేసి ఈ రెండు భాగముల చేత నిద్దరిని దహనము చే యవలసినది.

ద్విభార్యాగ్ని సంసర్గ విషయములో శిష్టాచారము కర్తవ్యము.

—*—

## * శవనిర్హరణక్రమః. *

శవమును ఇంటివద్ద స్నానము చేయించి, నూతనవస్త్రమును కట్టి, యజ్ఞోపవీతము వేసి, గంధ పుష్పములచే అలంకరించి, హిరణ్య శకలముల ౯ రంధ్రములయందుంచికట్టి, కుమారుడు కనిష్ఠ పూర్వకముగ ప్రాచీనావీతిచేసికొని అగ్నిహోత్రమును ముందుగా తీసికొనిరా, శవమును శ్మశానమునకు తీసికొనిపోవుచు, మార్గమందు మూడు స్థలముల క్రిందపెట్టి, పధిపిండము వేసి, చితిసమీపమును చేర్పవలయును.

—*—

## * శ్మశానమునకు గొనిపోయిన శవము బ్రతికిన. *

శ్మశానమునకు గొనిపోయిన తర్వాత శవమునకు ప్రాణములువచ్చిన వానిని ఇంటికి పిలుచుకొనివచ్చి, యమధర్మరాజును దర్శించెను. గనుక వానికొఱకు శాంతిని చేయవలయును. అదిచేయు క్రమమెట్లిదనిన; — వానికి క్షీరాభిషేకము చేసి, పాలు, నెయ్యి, ౧౦౦ సమిధలచేతను, ఎనిమిదివేలు గాయత్రీహోమము చేయవలయును. యమప్రీతికొఱకు గోదానము, వస్త్రదానము, తిలదానము చేయవలెను. బ్రాహ్మణులకు భూరిదక్షిణ ఇవ్వవలసినది. శ్మశానముననుంచిన చితినితీసి పారవేయవలయును.

—*—

## * శూద్రదహన నిషేధః. *

బ్రాహ్మణశవమును శూద్రుడు తీసికొనిపోయి దహనము చేయరాదు. శూద్రుడు శవమును తాకినట్లులైన సప్తకృచ్ఛ్రముల జేసి ప్రాయశ్చిత్తము చేసి దహనము చేయవలెను.

శూద్రుడు దహన సంబంధమైన ద్రవ్యములను — అనగా, అగ్నిహోత్రమును, దర్భను, నువ్వులు, నెయ్యి, సమిధలు, చెరువు, వీనిని తీసికొని రాకూడదు.

—*—

## —* శవమును గ్రామమునుండి తీసికొనిపోవుట. *—

బ్రాహ్మణ శవమును గ్రామమునుండి పశ్చిమ దిక్కుగాను, క్షత్రియ శవమును ఉత్తరపు దిక్కునకును, వైశ్య శవమును తూర్పు దిక్కునకును, శూద్ర శవమును దక్షిణ దిక్కునకును తీసికొని పోవలయును. ఇట్లు గ్రంథములందు చెప్పబడి ఉన్నను గ్రామాచారపద్ధతిని జరుపవలయును.

—*—

## —* శవముతో కూడా పోవు విధాయకము. *—

కర్త నూతన వస్త్రమును ధరించుకొని బద్దె యజ్ఞోపవీతముతో కూడా ప్రాచీనావీతిగా వేసుకొని తలవెంట్రుకలును ముడివేయక, అగ్నిహోత్రముందు భాండమునుతీసికొని, ముందుగా పోవలసినది. బంధువులు మొదలగువారు ప్రేతకుముందుగా కర్తలతో కూడా పోవలసినది. స్త్రీలు పసివారు శవమునకు వెనుక పోవలయును. అందరును పైన ఉత్తరీయములు లేక శవమును తీసికొని పోవలసినది.

—*—

## —* ఆశ్వలాయన విషయః. *—

ఋగ్వేదులకు, శవమును శ్మశానమునకు తీసికొనిపోవు మార్గ మధ్యమందు పథిపిండము లేదు. సంచయనహోమము లేదు. దశాహ దినమునందు అఘాపనుత్తి ఆనందహోమము లేదు. ౧౧ వ దినమున నవశ్రాద్ధము లేదు.

—*—

## —* శ్మశానమునకు శవమును గొనిపోయిన. *—

శవమునకును, అగ్నికిని మధ్య కుక్కగాని గాడిదగాని పోయినను, తాకినను, కృచ్ఛ్రత్రయములుచేసి అగ్నియందు ప్రాయశ్చిత్త

పూర్వకముగా వ్యాహృతిహోమము చేసి తర్వాత కర్మ చేయవలయును.

—※—

### ※ అనుక్తప్రాయశ్చిత్తవిధిః. ※

అకస్మాత్ గా ప్రమాదము సంభవించిన, దానికి విశేష ప్రాయశ్చిత్తము శాస్త్రమున చెప్పబడని యెడల, అట్టి సమయమున "భూర్భువస్సువః" అను వ్యాహృతిహోమము చేయవలయును.

—※—

### ※ అగ్నిపతనే భాండపతనేవా. ※

మార్గ మధ్యమందు అగ్నిదిగువ పడినయెడల యా అగ్నియందే పునఃప్రేతాహుతి చేయవలయును.

—※—

### ※ శవపతనే. ※

మార్గమధ్యమున శవము క్రిందపడినప్పుడు ప్రేతాగ్నియందు "ఇమారుద్రేతి" అను మంత్రముచేత ప్రాయశ్చిత్తమును, నేతిచేత హోమమును చేయవలెను.

—※—

### ※ అగ్నిపాత్రాభిన్నే. ※

శవముతోకూడ అగ్నిని తీసికొనిపోవు భాండము ప్రమాదమువలన పగిలిపోయిన, ఆపగిలిన తునకలను తీసికొని పరిశుద్ధమైన భూమియందుంచి "అభిన్నేభిల్లై" అను రెండు మంత్రముల చేతను ఆయగ్నియందే రెండు ఆహుతులను హోమము చేయవలసినది. మఱియొక పాత్రయందు అగ్నిని తీసికొని పోవలసినది.

—※—

### ※ దహనదేశనిర్ణయము. ※

ఆగ్నేయ దిక్కుయందుగాని నైఋతి దిక్కుయందుగాని దహనదేశమును ఏర్పాటు చేయవలయును. ఆదహనప్రదేశమున ముండ్లు, చెట్లును, గడ్డిన్ని లేకుండా చేయవలసినది.

### —* దహనప్రకారః. *—

మంచి కట్టెలచే కాష్ఠమును నేర్పఱచి, యా కాష్ఠమునందు అలంకరించిన శవమును పూర్వముఖముగా దక్షిణ శిరస్సుగా ఉంచి పైనవేసిన వస్త్రములో సగము శ్మశానవాసికినిచ్చి మిగత సగమును అట్లనే ఉంచి మంత్రపూర్వకముగా దహనము చేయువలసినది.

—*—

### —* కుంభచ్ఛిద్రోదకధారా ప్రదక్షిణం. *—

నూతనమైన కడవలో నీరుపోసి, ధారపడునట్లుగా కడవకు రంధ్రముచేసి, కర్త తన ఎడమ భుజముమీద నుంచుకొని, అపసవ్యముగా చితికి మూడు ప్రదక్షిణములు రావలయును. ప్రేతనుచూడక కుండను వెనుకప్రక్కకు వదలిపెట్టి, సూర్యునిచూచి, కపాలమోక్షమయ్యేవరకు ఉండి, కట్టుకొనియున్న బట్టతో సహా స్నానము చేయవలెను.

—*—

### —* అనాథ బ్రాహ్మణ సంస్కార ఫలము. *—

అనాథ బ్రాహ్మణప్రేతను మంత్ర పూర్వకముగా సంస్కారము చేసిన యాచేసినవానికి ఆనుపూర్వకముగా పదేపదే యజ్ఞములు చేసిన ఏఫలము గలుగునో ఆఫలము గలుగును. సచైల స్నానము చేతనే శుద్ధుడగుచున్నాడు. అగ్నిసంస్కారము చేతనున్ను తాకినందుచేతనున్ను ఆశౌచములేదు. గోత్రమును, పేరునుచెప్పి సంస్కారము చేయవలయును. గోత్రము తెలియనప్పుడు కాశ్యపగోత్రమును, పేరు తెలియనప్పుడు యజ్ఞేశ్వరునిపేరు చెప్పవలయును.

—*—

### —* రాత్రౌస్నానవిధిః. *—

సూర్య చంద్ర గ్రహణములు, వివాహము, పుత్రజననము, మరణము, వీనియందు రాత్రికాలముల స్నానము చేయవచ్చును.

—*—

### —— * రాత్రౌ పైతృమేధిక నిషేధః. * ——

రాత్రి వేళలో ప్రేతదాహాది కర్మను, నగ్న శ్రాద్ధమును చేయ కూడదు. సూర్యుఁడు అస్తమించకమునుపే కర్మను ఆరంభించి రాత్రి పూట పూర్తి చేయవచ్చును.

—*—

### —— * తిలోదకవిధిః. * ——

ప్రతి దినమునందును ప్రేతకు సంపూర్ణముతైన తిలోదకము లను విడువ వలసినది. ఎంతవరకు ౧౦ పిండముల ముగింపు అగుచు న్నదో అంతవరకు తిలోదకవృద్ధి ముగింపు చేయవలసినది.

—*—

### —— * తిలోదక ప్రకారః. * ——

కర్త ఉదయమున లేచి, నదికేగి, సచైల స్నానముచేసి నియత మైన మనస్సుగలవాఁడై పరిశుద్ధుడైన బ్రాహ్మణునిచే పాషాణమును తీసికొనివచ్చి దానియందున ౧౦ తిలోదకములు ప్రతిదినమును విడువ వలయును. ఇది యాశ్వలాయన విషయము.

ఆపస్తంబవిషయము. ప్రతిదినమును ఏకోత్తర వృద్ధిగా తిలో దకమును విడువవలయును. యజ్ఞోపవీతమును బద్దెయును ప్రాచీనా వీతిగా వేసికొని దక్షిణాభి ముఖముగా కూర్చుండి శిలయందు తిలో దకము విడువ వలెను.

—*—

### —— * శిలాప్రతిష్ఠ. * ——

శిలను ప్రతిష్ఠ చేసియే దానికి పిండమును, తిలోదకమును ఇవ్వ వలసినది. ఇట్లు చేయనియెడల ప్రేత తృప్తినొందదు.

—*—

### —— * శిలాలక్షణం. * ——

శిల తెల్లదిగానైనను, ఎర్రనిదిగానైనను ఉండవచ్చును. బహు నీలవర్ణము గలిగినదిగా యుండరాదు. శిల ౪ అంగుళముల పొడుగు గలదిగా నుండవలయును. అట్టి శిలకు దర్భనుచుట్టి ప్రతిష్ఠ చేసి శిలా

స్నానము చేయవలసినది. పిమ్మట దినము మూడు ఆవర్తులు మృదా స్నానము చేయవలసినది. ప్రతిదినమును ౩ వాసోదకములను విడువవలసినది, తిలోదకము.

| | | | |
|---|---|---|---|
| ౧ దినము | ౩ ఆవర్తులు | ౬ దినము | ౮ ఆవర్తులు |
| ౨ దినము | ౪ ఆవర్తులు | ౭ దినము | ౯ ఆవర్తులు |
| ౩ దినము | ౫ ఆవర్తులు | ౮ దినము | ౧౦ ఆవర్తులు |
| ౪ దినము | ౬ ఆవర్తులు | ౯ దినము | ౧౧ ఆవర్తులు |
| ౫ దినము | ౭ ఆవర్తులు | ౧౦ దినము | ౧౨ ఆవర్తులు |

ఈప్రకారముగా తిలోదకమును, శిలాస్నాన మృదాస్నానములను దశమదిన పర్యంతము చేయవలసినది.

—*—

## —* నిత్య పిండదానవిధిః. *—

శిలాసమీపమున గోమయముచే శుద్ధి చేయబడిన స్థలమునందు అగ్నిని ప్రతిష్ఠచేసి, ఇత్తడిపాత్రయందు అర్ధశేరు బియ్యమును, పావుశేరు పెసలును, పరకశేరు నువ్వులును ౧ ఫలము అల్లమును, ఉంచి పచనముచేసి నెయ్యిపోసి పెద్దపిండముగాచేసి శిలకునెదుట దక్షిణాగ్రముగా భూమియందు దర్భవేసి దానిమీద తిలోదకము విడిచి మంత్రము లేక నామగోత్రములచే పిండము నుంచవలసినది. పునః పిండమునందు తిలోదకమును విడిచి గంధపుష్పములచే అలంకరించి పూజచేసి ధూప దీపము లేక ౧౦ దినములును ప్రేత తృప్తికొరకు పిండదానము చేయవలసినది.

—*—

## —* పిండస్య వినియోగః. *—

ఈ పిండమును పరిశుద్ధమైన స్థలమునందు వాయసములకొఱకు ఉంచవలసినది. ఆవాయసములయందు కర్మ పూర్తియగు నంతవఱకు ప్రేతయుండునని వేదములందు చెప్పబడి యున్నది. వాయసము లేనిపక్షమున ఉదకమునందుగాని, అగ్నియందుగాని వేసి స్నానము చేయవలయును.

——* పిండస్య కాకస్పర్శననియమః. *——

౧౦ దినములలో నెంతవరకు కాకి ప్రేత పిండమును తినకపోతున్నదో యంతవరకు ౧౦౦ శ్రాద్ధములు చేసినప్పటికిని ప్రేతత్వము విముక్తి కానేరదు. కాకి ముఖ్యముగా పిండము తినవలెను. లేనియెడల ప్రేతత్వవిముక్తి కానేరదు.

——*——

——* పిండస్యశ్వాది దూషణే. *——

ప్రేతపిండమును కుక్క, పంది, పిల్లి, నక్క, కోడి, తాకినను, పిండము విరిగిపోయినను, రెండు ప్రాజాపత్య కృచ్ఛ్రములం చేసి పునః అన్నము పచనముచేసి పిండప్రదానము చేయవలయును.

——*——

——* గ్రస్తాస్తే పిండదాన ప్రకారః. *——

చంద్రుడు గ్రస్తాస్తమయమైన ఆదినమున నిత్యకర్మ చేయరాదు. ముందు దినము నాకర్షించి నిత్యకర్మ చేయవలయును. ౧౦ వ దినమునందు గ్రస్తాస్తమయము ప్రాప్తించిన యెడల పూర్వదినము నందే యాకర్షించిచేసివేసి యాదినమున దశాహ తంత్రమును మాత్రము జరుపవలసినది. ౧౧ వ దినము గ్రస్తాస్తమయ దినము అయిన యారోజున ఏకోద్దిష్టమువరకు జరిపి షోడశము ౧౨ వ రోజున చేయవలయును.

——*——

——* రాత్రౌ తిలోదకాదీనాం నిషేధః. *——

తిలోదకము, పిండప్రదానము, నవశ్రాద్ధములు, నగ్నశ్రాద్ధము, ఈకార్యములను రాత్రియందుగాని అపరాహ్ణకాల మతిక్రమించిన తర్వాత, సాయంకాలమున గాని చేయకూడదు. ఇట్లుగాక రాత్రివేళ చేసిన యాకర్మనిష్ఫలము బొందును. = వ్యర్థముచెందును.

——*——

——* స్థలాదివిపర్యాసే. *——

నిత్యకర్మ ఒకేస్థలమున నొకేపాత్రతో, యొకేమాదరి బియ్య

ముతో యొకచేశిలకు దశదినములును చేయవలెను. స్థలము తప్పించి నను, బద్దబోయినను, శిల నష్టమైనను, పాత్ర దారపోయినను, కర్త నష్టమైనను, ప్రాజాపత్య కృచ్ఛ్ర త్రయములు చేసి, మరల ప్రథమ దినము మొదలుకొని సంఖ్యాప్రకారముగా తిలోదకముల విడిచి పిండ ములు పెట్టవలసినది.

—*—

——* దేశవిపర్యయే అపకర్షః. *——

నిత్య కర్మ జరుగుచుండగా మఱియొక దేశమునకు పోవుట తటస్థించినయెడల దశాహస్సులోపల జరగబోవు దినములకు కర్మను ఆకర్షించి నిత్యకర్మ పూర్తిచేసి శిలను దీసికొని యాదేశమునకుపోయి మిగత దశాహ తంత్రము మొదలుకొని కర్మ పూర్తిచేయవలెను.

—*—

——* దశాహమధ్యే తిలోదక పిండదానాతిక్రమః. *——

మృతినొందిన దినము మొదలుకొని నిత్యకర్మ ప్రతిదినమును చేయుచు రావలయును. ౧౦ దినములలోపల చేయుడమునకు అభ్యం తరమైనప్పుడు ఎప్పుడైతే ఉపక్రమించి కర్మ ఆరంభము చేయుచు న్నాడో ఈ ౧౦ దినములును కర్మ అంతర్దశాహమునందు ఏప్రకా రముచేసెనో అట్లేప్రకారముగా తిలోదక పిండప్రదానమే మొదలు గాగల కర్మను యథావిధిగా చేయవలెను.

—*—

——* ప్రేతశిలానాశే. *——

నిత్య కర్మ చేయుచుండగా దశాహస్సులోపల శిల దారపో యినయెడల మరియొకశిలను తీసికొనివచ్చి ప్రాజాపత్య కృచ్ఛ్రత్ర యములుచేసి, శిలాప్రతిష్ఠచేసి, యాశిలయందు ప్రథమదినము మొద లుకొని తిలోదక పిండప్రదానముల చేయవలయును.

పోయిన శిలయే మరల దొరికినయెడల అప్పుడు చేయుచున్న నూతన శిలతోగూడా పెట్టి “ఇమేయమే” అను మంత్రముచేయావా

——* తండ్రి దశాహానంతరం ఇతరులు మరణించిన. *——

౧౦ వ దినము సాయంకాలమునగాని రాత్రి మూడు యామ ములలోపలగాని ఎవరైనను మృతినొందిన తండ్రి యాశౌచము వెళ్ళిన తర్వాత ౨ రోజుల ఆశౌచము ఉండి నిత్యకర్మ తిలోదక పిండదాన ముల ౧౦ రోజులలో చేయవలసినకర్మను నా ౨ దినములలో పూర్తి చేసి, మృతినొందిన ౧౧ వ దినమున ఏకోద్దిష్టముచేసి, షోడశ సపిం డీకరణములు చేయవలసినది.

—*—

——* తండ్రి దశాహస్సు ప్రాతఃకాలమున మృతినొందిన. *——

౧౦ వ దినము వేకువఝామున ఎవరైనను మరణించిన తండ్రి యాశౌచము మీద మూడు రోజులు అధికముగా ఉండి దశాహప ర్యంతము కర్మను పూర్తిచేసి, మృతినొందిన ౧౧ వ దినమున ఏకో ద్దిష్టముచేసి షోడశ సపిండీకరణాదులు యథావిధిగా చేయవలయును.

—*—

——* తల్లి దశాహ పూర్వము పుత్రుఁడు మరణించిన. *—

తల్లి దశాహస్సులోపల పుత్రుఁడు మృతినొందిన నిత్యకర్మ ఆరంభముచేసి తిలోదక పిండప్రదానములు చేసి, తల్లి యొక్క దశా హతంత్రముతో పుత్రుని దశాహస్సును జరిపించి, పుత్రుఁడు మృతి నొందిన ౧౧ వ దినమున ఏకోద్దిష్టముచేసి, షోడశ సపిండీకరణముల చేయవలెను.

—*—

——* మృత తిథి తెలియక పోయిన. *——

దేశాంతరమున మృతినొందిన వారి మృత తిథి తెలియకపో యిన కృష్ణపక్షము అష్టమీ, ఏకాదశి, అమావాస్య ఈ తిథులలో కర్మనారంభించి పూర్తి చేయవలెను. ఆతిథియే ప్రత్యాబ్దిక శ్రాద్ధ మును చేయుచుండవలెను.

—*—

—* పునః సంస్కారవిధిః. *—

మృతినొందిన ౧౧ దినముల లోపల నవశ్రాద్ధములు పూర్తి కాని పక్షమున పాలాశవిధిచేత కర్మ పూర్తిచేసి పిమ్మట సంవత్సరములోపలగాని, దహనము చేసిన స్థలమున ప్రేతయొక్క అస్థులు చిక్కినగాని, ౧౧ వ దినమున ఏకోద్దిష్టము చేయని పక్షమునగాని, అవుపాసనాగ్నిచేత దహనము చేయని పక్షమునగాని, మంత్రము లేక దహనముచేసిన పక్షమున పునః సంస్కారము చేసి కర్మచేయవలెను.

—*—

—* సంవత్సరమధ్యే సంస్కారవిధిః. *—

మంత్రావృత్తిగా చేయు కర్మ మధ్యలో విఘ్నములచే నిలిచి పోయిన సంవత్సరము లోపల పునః దహన సంచయనములు వదలి పెట్టి శిలా ప్రతిష్ఠ మొదలుగా గల కర్మను యథావిధిగా కర్మను పూర్తి చేయవలసినది.

—*—

—* పునః దహన నిషిద్ధకాలః. *—

శుక్రోదయను— వృద్ధత్వము— అస్తంగతుము— నూతనమైన తీర్థయాత్ర, ఈకాలములయందు పునర్దహనము చేయరాదు.

—*—

—* కాల మతిక్రమించినప్పుడు చేయువిధి. *—

అధిక మాసమునందును, ఆషాఢ శుద్ధ పౌర్ణమి మొదలు కార్తీక శుద్ధ పౌర్ణమి వరకు, గురు శుక్ర మూఢములందును, కర్మ అతిక్రమించి పోయినప్పుడు పైఁ జెప్పిన కాలములందు పునఃసంస్కారముచేసి కర్మ చేయవలెను.

—*—

—* త్రిపక్షాత్పూర్వంకాల నియమాభావః. *—

కర్మకాల మతిక్రమించిన తర్వాత మూడు పక్షములలో నైన

దిన వార శుద్ధియు, గురు శుక్ర మూఢ దోషములను చూడకయే పునర్దహనము చేసి కర్మ చేయవలయును.

—*—

—* ఏకోద్దిష్టానాం కాలనిర్ణయః. *—

ఏకోద్దిష్టము, నవశ్రాద్ధము, మొదలైన శ్రాద్ధములు మధ్యాహ్న కాలమునందు గాని, కుతుపకాలపు ప్రథమ భాగమునందు గాని చేయవలెను. పైఁ జెప్పిన శ్రాద్ధములు సంధ్యాకాలమునందు గాని, రాత్రికాలమునందుగాని చేయగూడదు.

—*—

—* ఏకోద్దిష్టానాం తిథినిర్ణయః. *—

సూర్యోదయమైన తర్వాత ౧౦ ఘడియలు లోపల ఆమ శ్రాద్ధమును, దానిమీదట ౨౦ ఘడియల లోపల ఏకోద్దిష్టమును, అందుమీద పార్వణ శ్రాద్ధమును చేయవలెను. నాందీశ్రాద్ధమును చేయదగు కాలము ప్రాతఃకాలము.

—*—

—* ఏకోద్దిష్టముచేయువిధి. *—

దైవహీనముగను, ఏకార్ఘ్యమును, ఏకపవిత్రమును ఏకోద్దిష్టము చేయవలెను. ఆవాహనము లేదు, అగ్నౌకరణమును, చేయవలెను. అపసవ్యముగా శ్రాద్ధమును చేయవలసినది.

—*—

—* సపిండీగతైకోద్దిష్టే యావాహనాదివిధిః. *—

సపిండీకరణమునందు చేయు నేకోద్దిష్టమునకు ఆవాహనయు, అర్ఘ్యము, అగ్నౌకరణము మొదలుగా గలవి ఆచరింపవలసినవి.

—*—

—* ఏకోద్దిష్టే నిషిద్ధాని. *—

అగ్నౌకరణము, ఆవాహనము, పుష్పము, ధూపము, దీపము, అభిశ్రవణము, విశ్వేదేవతలును, ప్రణవము, నమస్కారము, స్వధాకారము— ఈ చెప్పిన ౧౦ న్ని ఏకోద్దిష్ట శ్రాద్ధమునందును, నవ

శ్రాద్ధమునందు చేయపనిలేదు. అయినను సపిండీకరణ ఏకోద్దిష్టమున చేయవలసినది.

—*—

——* దశాహాత్పూర్వం నిషిద్ధాని. *——

సూతకము వెళ్ళునంత దాక ఇంటిలో నగ్న శ్రాద్ధమును చేయరాదు. శ్మశానమునందు చేయవచ్చును. నవశ్రాద్ధ నిత్య కర్మ చేయు స్థలమున చేయవలెను. దహనమైన తర్వాత క్షౌరము చేసు కొని నగ్నశ్రాద్ధము చేయవలయును. కొన్ని దేశములలో సంచయ నాత్పూర్వము గృహమునందు మృతినొందిన స్థలముననే నగ్నశ్రా ద్ధము చేయుచున్నారు. ఇదియే యాచారముగ నేదేశముననుండునో యాదేశవాసులు యట్లే చేయవలెను.

—*—

——* నగ్నశ్రాద్ధే ఆమవిధి. *——

బియ్యం ౮ పళ్ళును, గోధుములు ౪ పళ్ళును, మినుములు ౨ పళ్లును, పెసలు ౨ పళ్లును, కంచుచెంబు, క్రొత్తవస్త్రము, కూరలు, అయఃపాత్ర, ప్రత్తి, కంబళి, నెయ్యి, దీపము, ఘంట, పుస్తకము, దక్షిణ, తాంబూలము, వీటిని అంధత్వ, బధిరత్వ, మూకత్వ, నగ్నత్వ, నివృత్తి కొరకు శుద్ధ శ్రోత్రియునికి ఇవ్వవలెను.

—*—

——* ఉపవీతవిధి. *——

ప్రేత కర్మ చేయు నపుడును, ప్రాణాయామ కాలమునం దును, నమస్కరించు సమయమునను, స్నానము చేయు నపుడును, ప్రదక్షిణమునందును, యజ్ఞోపవీతము సవ్యముగా యుండవలసినది.

—*—

—* దశాహమధ్యే శ్రాద్ధానాం అమంత్రకత్వవిధిః. *—

దశాహస్సు లోపల చేయవలసిన నవశ్రాద్ధములు, నగ్నశ్రా ద్ధము అమంత్రవత్తుగా, తంత్రముచేత చేయవలసినది. పైఁ జెప్పబ డిన శ్రాద్ధములందు అగ్నౌకరణము, విశ్వే దేవస్థానమును, మంత్ర

ము లేని యావాహనయు, ధూపమును, దీపమును లేదు. ఏకాదశే హాని నవశ్రాద్ధము మొదలు ఇతరశ్రాద్ధములు సమంత్రవత్తుగా జరుపవలసినది.

—*—

## * నవశ్రాద్ధవిధిః. *

ప్రథమ దినము, ౩ వ, ౫ వ, ౭ వ, ౯ వ, ౧౧ వ, దినములందు ౬ నవశ్రాద్ధముల చేయవలయును. ఇది యాపస్తంబీయ విధిః.— ఆశ్వలాయనులు ౫ నవశ్రాద్ధములును, ఇతరులు ౫ గాని ౬ గాని చేయవలసినది.

—*—

## * నవశ్రాద్ధము నిలిచి పోయిన. *

౯ వ దినం కర్మ నారంభము చేసి నప్పుడు ఆదినము నవశ్రాద్ధముతో కూడా నిలిచి పోయిన నవశ్రాద్ధముల చేర్చి చేయవలెను. అట్లు చేయుటకు ఏదియైన యభ్యంతరము గలిగి నపుడు ౧౧ వ దినము చేయవలసినది. ఆశ్వలాయనులు ౯ వ దినమే నవశ్రాద్ధముల చేయవలెను.

—*—

## * త్రిరాత్రాశౌచ నవశ్రాద్ధవిధీ. *

ప్రథమ దినమున ౨ ను, ద్వితీయ దినమున ౨ ను, తృతీయ దినమున ౧ యు, చతుర్థ దినమున ౧ యు, త్రిరాత్రాశౌచ కర్మ చేయునపుడు చేయవలెను.

ఆశ్వలాయనులు ప్రథమ దినమున ౨ ను, ద్వితీయ దినమున ౨ ను, తృతీయ దినమున ౧ యు, చేయవలసినది.

—*—

## * త్రిరాత్రాశౌచే శిలాస్థాపన తిలోదకవిధి. *

ప్రథమ దినమున ౯ శిలాస్నానములును, ౯ మృదాస్నానములును, ౯ వాసోదకములును, ౨౧ తిలోదకములును చేయవలెను. ద్వితీయ దినమున ౧౨ శిలాస్నానములును, ౧౨ మృదాస్నానము

లును, ౧౨ వాసోదకములును, ౨౧ తిలోదకములును, ౪ పిండము లును చేయవలయు. తృతీయేహాని ౯ శిలాస్నానములు, ౯ మృదా స్నానములు, ౯ వాసోదకములు, ౩౩ తిలోదకములు, ౩ పిండ ములు చేయవలయు. ఇది యాపస్తంబీయవిధి.

ఆశ్వలాయన విధి ఎట్లనిన?— ప్రథమ దినమున ౩౦ తిలోదక ములు, ౩ పిండములు,— ద్వితీయ దినమున ౪౦ తిలోదకములును, ౪ పిండములును,—తృతీయ దినమున ౩౦ తిలోదకములును ౩ పిండ ములును, ఈ ప్రకారముగ నిత్య కర్మ చేయవలసినది.

ప్రథమ దినమున ౩ శిలాస్నానములు, ౩ వాసోదకములు, ౧౫ మృదాస్నానములు, ద్వితీయ దినమున ౪ శిలా స్నానములును, ౨౦ మృదాస్నానములు, ౪ వాసోదకములును, తృతీయ దినమునందు ౩ శిలాస్నానములు ౧౫ మృదాస్నానములు ౩ వాసోదకములు ఈప్రకారము శిలాస్నాన, మృదాస్నాన, వాసోదకములు చేయ వలసినది.

—❋—

## ——❋ భోగశరీరోత్పత్తిః. ❋——

మృతి నొందిన వానికి ప్రథమ దినమున పిండప్రదానము చేసి నందున శిరస్సు ఉత్పత్తి అగును. రెండవ దినమున నేత్రములు, శ్రోత్రియములు, నాసికయు ఉత్పత్తి యగుచున్నవి. మూడవ దిన మున భుజములు, ఉదరము, స్తనములు, కంఠము, ఉత్పత్తి యగుచు న్నవి. నాలుగవ దినమున నాభిస్థాన, గుదస్థాన, లింగము, ఉత్పత్తి యగుచున్నవి. అయిదవ దినమున తొడలు ఉత్పత్తి యగును. ఆరవ దినమున చర్మము, ఏడవ దినమున సమస్త నరములును, ఎనిమిదవ రోజున రోమములును, తొమ్మిదవ దినమున వీర్యసంపత్తియు, ఏర్ప డును. పదియవ దినమున ఆకలియు కలుగును. ౧౦ దినముల లోపల పిండమును వాయసము భక్షింపక పోయెనేని నూరు శ్రాద్ధముల చేసి నను ప్రేతత్వము వదలదు. కాకి తినని పక్షమున గంగలో వేయవలసి నది. ఈ ౧౦ దినములు నిత్య కర్మ చేసి పిండ ప్రదానము చేసినం

దున పిండ శరీరము గలిగి యాశరీరమునందు జీవుడు ప్రవేశించి ప్రభూత బలిని భుజించును.

—*—

## —* త్రిరాత్రాశౌచే ఏకోద్దిష్ట సపిండీ కరణాని. *—

మృతి నొందిన దినము కర్మను ఆరంభము చేసి మూడు దినములు తిలోదక పిండ ప్రదానములు చేసి మూడవ దినమున దశాహస్సుచేసి, నాలుగవ దినమున ఏకోద్దిష్ట శ్రాద్ధమును జరిపి, ఐదవ దినమున షోడశ సపిండీకరణములతో కర్మ పూర్తి చేయవలెను.

గ్రంథాంతరమున:— ఎనిమిదవ లేక, తొమ్మిదవ దినమున నిత్య కర్మ నారంభించి, సంఖ్య ప్రకారము తిలోదకముల విడిచి, సంఖ్య ప్రకారము పిండముల బెట్టి, నవ శ్రాద్ధముల జరిపి, ౧౦ వ దినమున నిత్య కర్మ పూర్తి చేసి, దశాహ తంత్రము నాచరించి ౧౧ వ దినమున ఏకోద్దిష్ట శ్రాద్ధము చేసి షోడశమును జరిపించి ౧౨ వ రోజున సపిండీ కరణముతో కర్మను పూర్తి గావింపవలెను.

—*—

## —* త్రిరాత్రాశౌచే జ్ఞాతి తిలోదకవిధిః. *—

మృతి నొందిన వారికి త్రిరాత్రాశౌచవిధిగా కర్మచేసి నపుడు జ్ఞాతులు మృతి నొందిన ౧౦ వ దినమున క్షౌరము చేసికొని దర్భకూర్చయందు వసురూపముచేత తిలోదకముల విడిచి ౧౧ వ దినమున స్నానము చేసి యజ్ఞోపవీతములు వేసికొనవలెను.

—*—

## —* ఆశౌచ నియమః. *—

కర్త ౧౦ దినములు కర్మచేయు నపుడు క్షౌరము చేసికొనక, లవణ మధు వర్జితమగు అన్నము భుజింప వలసినది. భూమిమీద పడుకొనవలయు. భార్యా సంగమము నిషేధము. ఇట్లు బ్రహ్మచర్య వ్రతము నాచరించుచు కర్మచేయవలసినది. ఇట్టి నియమము గృహస్థులు కేగాని వృద్ధులు, బాలురు వీరు అవలంబించ వలసినది పనిలేదు.

—*—

——* దశాహమధ్యే దర్శ సంక్రమాదౌ. *——

తల్లి తండ్రులు, మాతామహుఁడు, మాతామహి మరణము లందు పుత్రుఁడు, దౌహిత్రుఁడు, దత్తపుత్రుఁడును నిత్య కర్మ చేయు చుండగా పది దినములలో అమావాస్యగాని సంక్రమణముగాని వచ్చి నయెడల నిత్య కర్మను నిలుపరాదు. యథావిధిగా తిలోదక వాసో దక పిండ ప్రదానముల చేయవలసినది. వీరు తప్ప ఇతరులు—అన్న మొదలగువారికి కర్మ చేయుచుండిరేని అమావాస్య, సంక్రమణములు గలిగిన పక్షమున పై దినములతిలోదక పిండ ప్రదానముల సమాప్తి చేసి దశమ దినమున శిలావిసర్జనము హోమము చేయవలయును.

—*—

——* అమావాస్యాయాం మరణే. *——

అమావాస్య దినమున తల్లి దండ్రులు మొదలగు వారెవరు మరణించినను నిత్య కర్మ నిలుపరాదు. యథావిధిగా ౧౦ దినములును నిత్య కర్మ చేసి, దశాహ తంత్రమును సలిపి కర్మ చేయవలయును.

గ్రంథాంతరే ॥ మృతినొందిన దినమునకు సమీపమున దర్శ సంక్రమణములు వచ్చిన దర్శ సంక్రమణములు వెళ్ళిన తర్వాత నిత్య కర్మ ఆరంభించ వలయును. ఇది జ్యేష్ఠ భ్రాతాదుల మరణమందు కర్తవ్యము.

—*—

——* త్రిరాత్రాశౌచే దర్శ సంక్రమణాదౌ. *——

త్రిరాత్రాశౌచ విధిగా కర్మ చేయుచుండు నపుడు, అంతర్ద శాహమునందు దర్శ సంక్రమణములు ప్రాప్తంబైన యెడల ఆదినమే నిత్య కర్మ, తిలోదక పిండప్రదానముల సమాప్తి చేయవలెను. ౩ వ దినమున దశాహస్సుజరిగించి ౪ వ దినమున ఏకోద్దిష్టమును చేయవల సినది.

—*—

——* దేశోపద్రవాది సంప్రాప్తే. *——

మాతా పితృలకు కర్మచేయు నపుడు దశాహస్సు లోపల

దేశోపద్రవము కలిగినను సంకటము కలిగినను, మారీభయము పీడించుచున్నను, రాజభయము ప్రాప్తమైనను, దర్శ సంక్రమణములు సంప్రాప్తమైన యెడల ఏవిధము చేయవలయునో ఆ విధముగానే నిత్యకర్మ, తిలోదక, పిండ ప్రదానములు సమాప్తిచేసి, ఇతర దేశములకు పోవునప్పుడు శిలను వెంట తీసికొనిపోయి దశాహ దినమున శిలోద్వాసన హోమము జరిపించి ౧౧ వ దినమున ఏకోద్దిష్ట శ్రాద్ధము మొదలగు కార్యములను పూర్తి చేయవలసినది.

—*—

## ——* దహనానంతరం కర్తా గృహప్రవేశ క్రమః. *——

దహనానంతరం కర్త తన బంధువులతోగూడి పాద ప్రక్షాళనము చేసికొని స్త్రీబాల పురస్సరముగా ఇల్లు ప్రవేశించి, ఇంటి ద్వారమున వేపమండలు కట్టి, యాచమనముచేసి, గోమయమున పాదముల స్పృశింప చేసి, దీపదర్శనము చేసి, చనిపోయిన స్థలమున అన్నముయుంచి, నైవేద్యముచేసి, ఈ యన్నమును కాకికి నిడిపిమ్మట భోజనము గావించి, స్వస్థచిత్తుండై గరుడ పురాణమును పఠనము చేయవలసినది.

—*—

## ——* దహ్యమానాగ్నినష్టే. *——

శవము దహనమగు సమయమున వర్షముచేతగాని మరి ఎట్టి యుపద్రవముచేతగాని, అగ్ని ఆరిపోయినట్లైన కృచ్ఛ్రత్రయము చేసి, పునః అగ్నిచే మంత్రము తంత్రము లేక, శేషించిన శవమును దహించ వలయును.

—*—

## ——* సంచయన విధిః. *——

దహనదినము, ద్వితీయదినము, తృతీయ దినము, చతుర్థదినము, పంచమదినము, సప్తమదినము, నవమదినము దినవారశుద్ధి చూడకయే యంతర్దశాహమునందు సంచయనము చేయవలసినది.

—*—

—* సంచయన ప్రకారః. *—

కర్త బంధువులతో కూడ శ్మశానమునకు చని, దక్షిణాభిము ఖుండై పాలతో కూడా ఉదకమును కలిపి, జమ్మిమండచే పాలను శ్మశానాగ్నియందు ప్రోక్షణచేసి ఉదకముచే అగ్నిని చల్లార్చి, పాద ము మొదలు శిరస్సువరకు ఉండు అస్థులను చేరిచి, క్రొత్త కడవయం దుంచి, దానిని భూమిలో పాతిపెట్టి చేయవలెను. తర్వాత దహ నము చేసిన స్థలమున పురుషాకృతిగా రూపము ఏర్పరిచి బలి పిండ ప్రదానము చేయవలెను.

త్రిరాత్రాశౌచ విధమున కర్మచేయు నపుడు దహన దినము నందు, రెండవ రోజునగాని సంచయనము చేయవలయును.

—*—

—* శ్మశానాగ్ని ఆరిపోయిన. *—

శ్మశానాగ్ని ఆరిపోయిన యెడల ధర్మశాస్త్ర ప్రకారముగా అగ్నినష్ట ప్రాయశ్చిత్తముచేసి తర్వాత సంచయనము జరుపవలెను.

—*—

—* దహనము అమంత్రవత్తుగా జరిగిన. *—

సంచయన దినమున అస్థుల చేందీసి దహన సంబంధమగు ప్రయోగముచే పునర్దహనము చేసి, తర్వాత సంచయనము చేయ వలయును.

—*—

—* శాఖాంతరస్య కర్తృత్వేపి పైతృమేధిక విధిః. *—

సగోత్రుండుగాని, అసగోత్రుండు గాని, కర్మ చేయు నపుడు ప్రేతశాఖ ఏదియో ఆశాఖ ప్రకారముగానే దహనాది కర్మనుచేయ వలయును. ఇతర శాఖచే దహనము చేయరాదు. ప్రమాద వశమున ఒకశాఖవానికి మరియొక శాఖ ప్రకారము దహనము కలిగిన పునః దహనాది కర్మను చేయవలయును. ఋక్శాఖవానికి యజుశ్శాఖా విధ మున కర్మ నడిచిన పునః స్వశాఖచే వానికి కర్మ చేయవలయును. కాని యజుశ్శాఖవానికి ఋక్శాఖచే దహనాది కర్మ జరుపబడియుం

డిన స్వశాఖచే దహనము మాత్రము చేయనక్కర లేదు. సంచయనము మొదలుగాగల కర్మను చేయవలసినదే.

—*—

## —* సంచయన నిత్యకర్మా ప్రారంభవిధిః. *—

దహనమైన మరుదినమున సంచయనము చేయవలసినది. ప్రథమదినమునగాని, ద్వితీయదినమునగాని, తృతీయదినమునగాని, పంచమదినమునగాని, సప్తమదినమునగాని, నవమదినమునగాని, ఏవారమైనను ఈ వారములందు నిత్యకర్మ యారంభము చేయవలయును. సరిదినములందు ప్రారంభము చేయరాదు. ఈ ౯ దినముల లోపల నిత్యకర్మ ఆరంభము చేయుటకు సందర్భములేని యెడల ౧౦ వ దినమున నిత్యకర్మ ఆరంభముజేసి ఆదినమే శిలోద్వాసన వరకు చేసి దశాహస్సు జరిగించవలయును.

—*—

## —{ ప్రేతాశ్వలాయన శాఖీయుడై కర్త యాపస్తంబ సూత్రుడైన. }—

ప్రేతశాఖచే దహనము మొదలుకొని సపిండీకరణము పూర్తి చేసి అను మాసికముల పెట్టి, సంవత్సర విమోకముచేసి తిథి మొదలుకొని కర్త శాఖచేతనే చేయవలెను. అని గ్రంథమున చెప్పబడియున్నను దేశాచార ప్రకారమున నడుచుకొనవలయును.

—*—

## —* గంగాంభసి అస్థినిక్షేపణవిధిః. *—

అంతర్దశాహమున దిన వార శుద్ధి చూడకనే పరిశుద్ధమగు గంగయందు, అస్థులకు పంచామృతాభిషేకము ఆయా మంత్రములచే చేసి పుష్పములచే పూజచేసి, బ్రాహ్మణుల అనుజ్ఞను తీసికొని మంత్రపూర్వకముగా గంగయందు మూడు మార్లుగా వేసి స్నానము చేసి అస్థి నిక్షేపణాంగము గోదాన దశ దానములను, హిరణ్యశ్రాద్ధమును చేయవలెను.

—*—

:బహిర్దశాహే అస్థి నిక్షేపణవిధిః. *——

మృతినొందిన యొక మాసములోపల నేదినమున గాని, చేసి నెలలో, మూఢ దోషములు లేని నెలలో, ద్విపాద త్రిపాద ధనిష్ఠా పంచక దోషములును, నందభద్ర రిక్త తిథి దోషములును, ద్విపుష్కర త్రిపుష్కరాది దోషములును, లేని దినములలో గాని అస్థి నిక్షేపణ చేయవలసినది. మల మాసమునందు చేయరాదు. ఇట్టి దోషములు లేనియు, తారాబల యుక్తమైన దినమున అస్థులను కృష్ణాజినమునందు దర్భచే ధృఢముగా కట్టి తీసికొని పోయి గంగాది పుణ్య నదులలో అకరడకరడ కొన్నిటిని వేసి గోదాన దశ దానములను, హిరణ్య దానములను మొదలగునవి చేయవలసినది.

—*—

——* దశమ దినే ప్రేత భార్యా రజస్వలవిధీః. *——

దశాహస్సు దినమున ప్రేతభార్య రజస్వల అయిన దశాహ తంత్రమును, ఏకోద్దిష్టము మొదలగు కర్మలను యథావిధిగా జరిగించి స్నాన దినమున కంఠ సూత్రమును విసర్జించవలయును.

—*—

—* పుత్రహీనయగు స్త్రీ స్వకర్తృత్వ రజస్వలావిధిః. *—

నిత్య కర్మ యారంభము చేసిన తరువాత రజస్వలైన యెడల ౧౦ వ దినమున దశాహ తంత్రము జరిపించి శిలో ద్వాసన చేసి ౧౧ వ దినమున, ఏకోద్దిష్టము వరకు చేసి షోడశ సపిండీకరణముల నిలిపి స్నాన దినమున సూత్రవిసర్జనముచేసి అయిదవ దినమున షోడశసపిండీకరణములు చేయవలయును.

—*—

——* దశమేహాని వపనవిధిః. *——

దశమ దినమున పూర్వాహ్ణము నందు స్నానము చేసి గ్రామమునకు వెలుపల కర్మచేయు స్థలమున కర్త జ్ఞాతులతో సహా సంకల్ప పూర్వకముగా క్షౌరము చేసి కొని స్నానము చేసి కర్మ ప్రారంభము చేయావలసినది.

—— * దశమేహాని జ్ఞాతీనాం తిలోదకవిధిః.

కర్త శిలాస్నాన, మృదాస్నానములను చేసి, వాసోదకములను విడిచిన పిమ్మట జ్ఞాతులు (మరణించిన వానికి వయస్సులో చిన్న వారైన మాత్రమే క్షౌరము చేసి కొనవలయును. తండ్రి జీవించి యుండ జ్ఞాతులు చేయరాదు) దినమునకు మూడు వంతున ౧౦ దినములకు ౩౦ తిలోదకములను విడిచి కర్తతో సహా శిలోద్వాసన సమయమున స్నానము చేసి, పుణ్యాహ వాచనోదకము ప్రోక్షించు కొనవలయును.

—*—

కర్త జ్ఞాతులు విడిచిన తర్వాత తాను తిలోదకమును విడిచి, నిత్య పిండ ప్రదానము చేసి, క్షౌరము చేసికొని, అఘూపనుత్తి హోమాది కార్యములను చేయవలెను.

సూత్రము॥ అథైనాన్ జ్ఞాతీ ననుపూర్వాన్ కల్పయతి ॥
అర్థము = వృద్ధ పురుషా దక్షిణతః కనిష్ఠా ఉత్తరతః తతో వృద్ధా స్త్రియాః ॥

—*—

—— * దేశాంతర స్థితజ్ఞాతి తిలోదకవిధిః. * ——

జ్ఞాతులు దేశాంతరమున నుండు నపుడు ౧౦ వ దినమున క్షౌరము చేసి కొని దర్భ కూర్చ యందు దినమునను ౩ వంతున ౩౦ తిలోదకముల విడిచి ౧౧ వ దినమున స్నానము చేసి యజ్ఞోపవీతమును వేసి కొనవలయును.

—*—

—— * మాతామహ కర్మవిధిః. * ——

దౌహిత్రుడు మాతా మహులకు కర్మ చేయవలసి నట్లైన పితృ మాతృవుల కేరీతిగా కర్మ చేయవలయునో యా రీతిగానే దశ రాత్రాశౌచ విధిగా చేయవలయును.

—*—

### *పూర్వాశౌచ ఉత్తరాశౌచ జ్ఞాతి తిలోదకవిధిః.*

జ్ఞాతి మృతినొందిన యాశౌచము నాచరించు చుండగా మరి యొక జ్ఞాతి మృతినొందిన పూర్వాశౌచము చేతనే ఉత్తరాశౌచము శుద్ధి యగును. పూర్వాశౌచము నాచరించిన ౧౦ వ దినమున క్షౌరము చేసికొని తిలోదకము విడువ వలెను. ఉత్తరాశౌచమునకు జ్ఞాతులు క్షౌర తిలోదకములు ౧౦ వ దినమున విడువ వలెను. ఆశౌచము మాత్రము లేదు.

*

### *అసన్నిధానే జ్ఞాతీనాం తిలోదకవిధిః.*

మరణించిన వాని సాన్నిధ్యమున జ్ఞాతులు లేనియపుడును, దశాహారోజును రావుటకు వీలు లేక పోయినను, రోగముచే నశక్తుండుగా నున్నపుడును, జ్ఞాతులు క్షౌర తిలోదకముల చేయ పనిలేదు. గర్భిణీ పతిగా యున్న వానికి ౩ మాసములకు పైబడిన యెడల జ్ఞాతులు క్షౌర తిలోదకములను చేయు నక్కఱ లేదు. బ్రహ్మచారి జ్ఞాతులకు తిలోదకమును విడువ పనిలేదు.

*

### *స్త్రీకర్తృత్వే జ్ఞాతి తిలోదకవిధిః.*

మృతి నొందిన వాని పుత్రుండు అనుపనీతుండుగా యున్నప్పుడు స్త్రీ కర్తగా యున్నపుడు మృతినొందిన వాని తమ్ములు వారల కర్తవ్యము మీద కర్మ చేయునపుడు దశమ దినమున తాను క్షౌరము చేసికొని తానువిడవవలసిన తిలోదకము విడిచి పైన కర్మచేయవలెను.

*

### *సపిండీకరణానంతరం జ్ఞాతి తిలోదకవిధిః.*

సపిండీ కరణము జరిగిన తరువాత ౩ మాసముల లోపల సంగతి వినిన జ్ఞాతులు మూడు దినములు ఆశౌచము వుండి మూడవ దినమున పూర్వాహ్ణము నందు క్షౌరముచేసికొని దర్భకూర్చయందు ౩౦ మారులు తిలోదకమును విడిచి నాలగవ దినమున స్నానముచేసి

యజ్ఞోపవీతము ధరించి కొనవలెను. అని చెప్పబడియున్నను నీ విషయమున దేశాచార ప్రకారము నడచు కొనవలయును.

—*—

## —* బ్రహ్మచారిణాం తిలోదక నిషేధః. *—

బ్రహ్మచారి, మాతా పితృ జ్యేష్ఠ భ్రాత మాతా మహులు, ఆచార్యుడు—పై చెప్పినవారలకు క్షౌరము చేసికొని తిలోదకమును విడువ వలయును. వీర్లు తప్ప జ్ఞాతులు మొదలగు వారికి ఆ శౌచము వుండి తిలోదకమును విడువ పనిలేదు. క్షౌరము చేసికొని తిలోదకమును విడిచెనేని పునః ఉపనయనము చేసికొనవలయును.

—*—

## —* జీవపితృక భ్రాతృమరణే. *—

తండ్రి జీవించి యున్నపుడు అన్నగాని, అన్న భార్యగాని తమ్ముడు గాని మృతినొందిన కర్మ చేయరాదు. అట్లు చేసినయెడల తండ్రిని చంపిన దోషమును పొందుచున్నాడు కావున చేయరాదు.

—*—

## —* శిలోద్వాసనానంతరం ధర్మోదకవిధిః. *—

శిలోద్వాసన అయిన తర్వాత ఇష్టులు, శిష్టులు, బంధువులు మొదలగువారు దర్భ కూర్చయందు యజమానస్యపితృ గోత్రాయ శర్మణే ప్రేతాయ ప్రేత తృప్త్యర్థం మరణ దినాదాభ్య దశమేహని ఏశధర్మోదకందదామి అని చెప్పుచు మూడు దోసిళ్ళ ఉదకము విడువవలసినది.

—*—

## —* ఏకాదశేహనివిధిః. *—

౧౧ వ దినమున గృహముము గోమయముచేత శుద్ధి చేసి కర్త స్నానముచేసి స్వస్తి పుణ్యాహవాచనము చేసికొని నవ శ్రాద్ధము చేసి వృషోత్సర్జనము చేసి ఏకోద్దిష్టము మధ్యాహ్న కాలమునందు జరిగించి పిమ్మట షోడశము చేయవలసినది.

—*—

——* ఏకాదశేహని కర్తృభార్యా రజస్వలావిధిః. *——

కర్తృభార్య ౧౧ వ దినమున రజస్వల అయినయెడల ఏకోద్దిష్ట శ్రాద్ధమును, ద్విరావృత్తి ఆద్యశ్రాద్ధమును, రుద్రగణాఖ్య శ్రాద్ధమును, వృషోత్సర్జనాంగ శ్రాద్ధమును, చేయవలసినది. షోడశమును సపిండీకరణమును, చేయరాదు. మృతినొందిన ౨౩ వ దినమున షోడశ సపిండీకరణముల చేయవలెను. ఈవిషయమున దేశాచార వృద్ధాచారమును అనుసరించి నడుచుకొనవలయును.

——*——

— నవమదశమేహని కర్తృభార్యా రజస్వలావిధిః. —

నవమ దినమునందు కర్తృభార్య రజస్వలైనపుడు ౧౧ వ దినమున పుణ్యాహవాచనము, నవశ్రాద్ధము, వృషోత్సర్జనము, ఏకోద్దిష్టము, వరకు జరిగించి ౧౨ వ దినమున షోడశ సపిండీ కరణముల చేయవలెను. ౧౧ వ దినమున కర్తృభార్యకు స్నానదినమైన ఆదినమున షోడశమును జరుపవచ్చును. ౧౨ వ దినమున సపిండీ కరణము చేయవలెను.

——*——

——* షోడశమైన తర్వాత కర్తృభార్యా రజస్వలావిధిః. *——

౧౧ వ దినమున షోడశమైన పిమ్మట కర్తృభార్య రజస్వలైనపుడు సపిండీకరణము చేయకూడదు. ౧౫ వ దినమున సపిండీకరణము మాత్రము చేయవలెను.

——*——

—* పితాశౌచమధ్యే కర్తృమాతృ భార్యాప్రసూతౌ. *—

పితాశౌచమధ్య కర్తృమాతగాని భార్యగాని ప్రసూతియైన యెడల పితాశౌచముచేతనే జాతాశౌచము ముగింపు అగును. కర్మయథావిధిగా చేయవచ్చును. జ్ఞాతిసంబంధములైన జాతాశౌచములుగాని మృతాశౌచములుగాని వచ్చినయెడల పితృమాతాశౌచములచేతనే శుద్ధియగును.

—✱ ఏకాదశేహని జాతాశౌచమృతాశౌచవిధిః. ✱—

౧౧ వ దినమున కర్తకు జాతాశౌచముగాని మృతాశౌచముగాని వచ్చినపుడు ఆదినమే ఏకోద్దిష్టమువరకు కర్మచేసి నిలిపి ౧౦ దినములు ఆశౌచము ఉండి ఆశౌచాంతమున షోడశ సపిండీకరణములు కర్మ పూర్తిచేయవలెను.

—✱—

—✱ ఆద్యేకోద్దిష్టవిధిః. ✱—

౧౧ వ దినమున ఎన్ని అభ్యంతరములున్నను కర్తకు తాత్కాలికశుద్ధి ఉన్నందున ముఖ్యముగా ఆనాడే ఏకోద్దిష్టమును చేయవలెను. అట్లు చేయని పక్షమున పునః జరిగిన కర్మలయా ప్రాయశ్చిత్తును చేయవలసినది.

—✱—

—✱ ఆద్యేకోద్దిష్టస్య ద్విరావృత్తివిధిః. ✱—

ఆద్యేకోద్దిష్ట శ్రాద్ధమునందు బ్రాహ్మణునికి భోజనము పెట్టవలసినది. లేని పక్షమున అగ్నిహోత్రమునందు అన్నమును హోమము చేయవలసినది. పునః బ్రాహ్మణునికి భోజనము పెట్టవలసినది. ఇది ద్విరావృత్తి ఏకోద్దిష్టవిధానము.

—✱—

—✱ స్వతంత్రైకోద్దిష్టస్య బ్రాహ్మణాభావే. ✱—

ఏకోద్దిష్టశ్రాద్ధమున బ్రాహ్మణుడు దొరకని పక్షమున ఉదీరేతి మంత్రములచేతను స్వగృహ్యోక్త ప్రకారము పురుష సూక్తముచే ఘృతపాయసములను హోమము చేయవలెను. పునః బ్రాహ్మణునికి భోజనము పెట్టవలసినది. ఇత్యాది ద్విరావృత్తి స్వతంత్రైకోద్దిష్టశ్రాద్ధంబు. ప్రథమమున అగ్నియందు ఘృతము, శాకము, క్షీరము, గుడము, దధి ఈవస్తువులను అన్నముతో కలిపి ౩౨ ఆవర్తులు హోమము చేయవలయును. పునః ఆద్యశ్రాద్ధమును షోడశమును చేయునపుడు సంకల్పమునందు ద్విరావృత్తి చెప్పికొని చేయవలయును.

——* ద్విరావృత్తి ఆద్యమాసికస్య విఘ్నసంభవే. *——

(గ్రంథాంతరే) ౧౧ వ దినమున ఆద్యశ్రాద్ధమునకు విఘ్నము సంభవించినయెడల ౧౨ వ దినమునందుగాని ౨౩ వ దినమునందుగాని చేయవలయునని గ్రంథాంతరమున చెప్పబడి యున్నది.

——*——

——* రుద్రగణ శ్రాద్ధవిధిః. *——

౧౧ వ దినమున రుద్రునిగూర్చి ౧౧ బ్రాహ్మణులకు ప్రేతత్వ విముక్తికొరకు తేనె, పాలు, నెయ్యి సహితమగు అన్నము పెట్టవలయును.

——*——

——* వృషోత్సర్జనవిధిః. *——

మృతి నొందిన ౧౧ వ దినమున గోవృషభములను వస్త్రాదులచే అలంకరించి పూజించి హోమాది కార్యముల పూర్తిచేసినంత పైశాచికబాధ నివృత్తి యగుటకును, పితృదేవతల తృప్తికొరకును, వృషభమునకు పృష్ఠభాగమున చక్రముగాగాని, శూలముగాగాని, లాంఛనము వేసి వృషభమును విడువవలయును. అందుమీద వృషభముయొక్క త్వక్చర్మ రుధిర రోమ దహన ప్రాయశ్చిత్తము కొరకు అపాంఘట, ఆజ్య, వస్త్ర, హిరణ్య, దానములుచేసి అగ్నికొరకు బలుల ఇవ్వవలయును. వృషోత్సర్జనాంగ ఏకాదశ బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును. వృషోత్సర్జనమునకు వృషభము ఎర్రనివన్నెగలదై యుండవలయును.

——*——

——* సువాసినీవిషయే. *——

సువాసినీ మరణమున పుత్రులైనను, భర్తయైనను కర్మచేయుచుండిన వృషోత్సర్జనహోమము చేయనక్కరలేదు. గోవృషభమును మాత్రము పూజచేసి లాంఛనమువేసి విడువవలయును. ఈ విషయమున దేశాచారము కర్తవ్యము.

౧౧ వ దినమున వృషోత్సర్జనము చేయనియెడ ప్రేతకు ౧౦౦

శ్రాద్ధముల చేసినను పిశాచత్వము విముక్తిగాదు. కావున ముఖ్యముగా ఆదినముననే వృషోత్సర్జనము చేయవలెను.

—*—

—* అశక్తవిషయే. *—

ప్రత్యక్షమగు వృషభమును విడుచుటకు శక్తిలేని యెడల తండులమందు గోవృషభ ప్రతిమ నేర్పఱచి పూజ మొదలగు హోమమునుచేసి వృషోత్సర్జనమును చేయవలెను. ఇట్లు చేయుటకు శక్తిలేని యెడల సువర్ణ రూపకముగానైనను చేయవలెను.

—*—

—* వృషోత్సర్జనే యజ్ఞోపవీతవిధిః. *—

వృషోత్సర్జన హోమము చేయునప్పుడును, వృషభమును విడుచుసమయమునను ఉపవీతిగా ఉండవలయును. తక్కిన కార్యముల చేయునపుడు ప్రాచీనావీతిగా ఉండవలయును.

—*—

—* వృషోత్సర్జనే పరిధివిధిః. *—

ప్రేత వృషోత్సర్జనమునందు పరిధిప్రహరణము ఉండవలయును. కామ్యవృషోత్సర్జనమునందు శమ్యలు ఉండవలయును.

—*—

—* వసుగణ శ్రాద్ధవిధిః. *—

ప్రేత సంబంధమగు వృషోత్సర్జనమునందు వసుగణ శ్రాద్ధము ను ఏకోద్దిష్ట శ్రాద్ధ విధానముగా ౮ బ్రాహ్మణులకు అన్నము పెట్టి శ్రాద్ధమును చేయవలయును. కామ్యవృషోత్సర్జనమునందు నాందీముఖ విధానముగా ౮ బ్రాహ్మణులకు అన్నమునిడి వసుగణశ్రాద్ధమును చేయవలయును. అన్నము పెట్టుటకు శక్తిలేని పక్షమున ఆమముగాని, హిరణ్యముచేగాని, ఉదకముచేగాని, చేయవచ్చును.

—*—

—* ఏకోద్దిష్టవిధిః. *—

ఏకోద్దిష్ట మనగా ౧౧ వ దినమున అగ్నియందు "యత్తే

కృష్ణ ” అను మంత్రముచే అన్నమును ౩౨ ఆహుతులుగా హోమము చేయుటయే. ఇత్యాది యాద్యమాసికంబు. ౧౧, ౧౨, ౧౩, ౨౩, దినములు గాని యెప్పుడు గాని షోడశము చేయు నప్పుడు యీ ఆద్య మాసికమును ద్వీరా వృత్తిగా చేర్చుకొని చేయవలెను.

—*—

## —* షోడశవిధిః. *—

౧౧, ౧౨, ౧౩, దినమున సపిండీకరణము చేయు పక్షమున సంవత్సరము వరకు ప్రతి మాసమును పెట్టవలసిన మాసికముల నాకర్షించి వూన మాసికముల సహితము చేర్చి వసుగణ, రుద్రగణ వృషోత్సర్జనాంగ అవశిష్ట బ్రాహ్మణ భోజనముసహా చేర్చి ఏకోద్దిష్ట విధానముగా షోడశ శ్రాద్ధమును చేయవలయును.

—*—

## —* షోడశ వివరము. *—

౧. ద్వీరావృత్తి ఆద్య మాసికము, ౨. ఊన మాసికము, ౩. ద్వితీయమాసికము, ౪. త్రైపక్షికము, ౫. తృతీయ మాసికము, ౬. చతుర్థ మాసికము, ౭. పంచమ మాసికము, ౮. షాణ్మాసికము, ౯. ఊనషాణ్మాసికము, ౧౦. సప్తమ మాసికము, ౧౧. అష్టమ మాసికము, ౧౨. నవమ మాసికము, ౧౩. దశమ మాసికము, ౧౪. ఏకాదశ మాసికము, ౧౫. ఆబ్దిక మాసికము, ౧౬. ఊనాబ్దికము, ౧౭. వసుగణము, ౧౮. రుద్రగణము, ౧౯. వృషోత్సర్జనాంగ అవశిష్ట బ్రాహ్మణ భోజనము. ఈపై జెప్పబడిన ౧౯ శ్రాద్ధములను నాకర్షించి చేర్చి షోడశమును సపిండీ కరణమునకు మునుపు చేయవలయును.

పైఁ జెప్పబడిన ౧౯ శ్రాద్ధములయందును వెవ్వేరుగా బ్రాహ్మణుల నేర్పాటుచేసి పశ్చిమాభి ముఖముగా కూర్చుండబెట్టి ప్రత్యేకముగా గోత్ర నామములు చెప్పి తృణమునిచ్చి పాద ప్రక్షాళనము చేసి ద్వీరావృత్తి ఆద్యమాసికము మొదలు రుద్రగణ శ్రాద్ధ

ము వరకు, ప్రత్యక్షముగా అర్ఘ్యమును విడిచి వస్త్రాద్యలంకారము లచే పూజచేయ వలసినది.

—*—

## —* అగ్నౌకరణవిధిః. *—

సంకల్పము చేసికొని లౌకికాగ్ని యందు పరిస్తీర్య పరిషేచన ముచేసి. పిత్రే, గోత్రాయ, శర్మణే. ప్రేతాయ యమాయచ స్వాహా యని ఈ ప్రకారముగా ౧౮ ఆహుతులు లౌకికాగ్ని యం దున కొంచెము కొంచెముగా తీసికొని హోమముచేసి మిగత యన్న మును బ్రాహ్మణుల విస్తర్ల యందు కొంచెము కొంచెము పెట్టి మిగత యన్నమును పిండములతో చేర్చికొన వలయును.

—*—

## —* పిండప్రదానవిధిః. *—

బ్రాహ్మణ భోజనస్థాన తరువాత అగ్నౌకరణ శేషాన్నమును కొంత తీసికొని ఆద్యాద్యవశిష్ట పర్యంత శ్రాద్ధముల యందు ప్రేత తృప్తికొరకు విస్తరి ముందర వికరాన్నమును వేసి మిగత అన్నమును పిండముతో కూడా చేర్చికొని నారికేళ ప్రమాణము గల పిండము లను ౧౮ చేసి, పిండ ప్రదానము చేసి, ఉత్తర సంకల్పము చెప్పి శ్రాద్ధమును పూర్తి చేయవలెను.

—*—

## —* బ్రాహ్మణసంఖ్య. *—

ద్విరావృత్తి ఆద్యమాసికమునకు ఒకడును (౧) ఊన మాసిక మునకు (౧) ఒకడును, ద్వితీయ మాసికమునకు ౧ డును, త్రైపక్షి కమునకు ౧ డును, తృతీయ చతుర్థ పంచమ షాణ్మాసికములకు ౧ డును, ఊనషాణ్మాసికమునకు ౧ డును, సప్తమాష్టమ నవమ దశమ ఏకాదశాబ్దికము ౧, యూనాబ్దిక మాసికమునకు ౧ డును, వసురుద్ర గణములకును వృషోత్సర్జనాంగ అవశిష్ట బ్రాహ్మణ భోజనమునకు ౧ డును. ఈ విధమున ౯ గురు బ్రాహ్మణుల పెట్టి షోడశమును చేయ వలయును.

### * షోడశఆమవిధిః. *

(గ్రంథాంతరే) బ్రాహ్మణులు దొరకని పక్షమునను, రోగము వలన అశక్తతగా ఉన్నపుడును, శక్తిలేనపుడును నవ శ్రాద్ధ విధానమున ఆమపూర్వకముగా షోడశ శ్రాద్ధమును చేసి సపిండీకరణమును చేయవలయును.

—*—

### * అనుమాసికములవిధిః. *

మూడవ మాసమునందు గాని, అయిదవ మాసమునందు గాని కర్మచేయు పక్షమున అది వరకు జరిగిన మాసికములను పునః సపిండీకరణమైన తరువాత అను మాసికములు పెట్ట వలసినది లేదు. ఏ మాసము మొదలుకొని లెక్క అగుచున్నదో అది మొదలుకొని అను మాసికములు పెట్టవలసినది.

—*—

### * మలమాసవిధిః. *

ఒక సంవత్సరము నందు మలమాసము వచ్చిన యెడల అధిక మాసమునను, నిజ మాసమునను దర్శ శ్రాద్ధమును, మాసికమును చేయవలసినది. నిజ మాసమున శుభ కార్యముల చేయవలయును. మలమాసమున ఆశౌచముచే నొక వేళ ప్రత్యాబ్దిక, దర్శ శ్రాద్ధములును, అను మాసికములును, సంక్రాంతియు నిలిచెనేని ఆశౌచాంతమున పునః ఈ కార్యముల చేయవలసినది పని లేదు. నిజ మాసమున యథావిధిగా చేయవలయును.

—*—

### * మలమాసే మృతస్య ఆద్యమాసికవిధిః. *

అధిక మాసమున మృతినొందిన వారికి ఆ మాసముననే కర్మ చేయవలెను. ఆద్యమాసికమును చేయవలసినదే. నిజ మాసమున మృత తిథిని, అన్వాద్య మాసికమును వసురుద్రాదిత్య రూపములచే పెట్టి పిమ్మట అది మొదలు ౨౭ దినముల మీద ౩ దినములలో దిన వార శుద్ధి చూచి ఊన మాసికమును పెట్టి ఆయా మాసములందు

క్రమ క్రమముగా ఆయా మాసికములను చేసి ౧౨ వ మాసమున సాంవత్సరీక విమోకమును జరిగించవలయును.

—*—

——* మృతసంవత్సర మధ్యే మలమాసే. *——

మృతి నొందిన సంవత్సరము లోపల మలమాసము వచ్చిన యెడల మలమాస ప్రయుక్త మాసికమును, నిజ మాస ప్రయుక్త మాసికమును చేయవలయును.

—*—

——* మలమాసే మృతస్య ఊనమాసిక విధిః. *——

మలమాసమున మృతి నొందిన వానికి శుద్ధ మాసమున ఊన మాసికమును పెట్టి అది మొదలు క్రమముగా ద్వితీయాది మాసికములను చేయవలయును.

—*—

——* మలమాసే మృతస్య ప్రథమాబ్దికవిధిః. *——

మల మాసమున మృతి నొందిన వారికి నిజ మాసమునకు ౧౨ వ మాసమున సాంవత్సరీక విమోకము చేసి మరు దినము తిధి పెట్టవలయును. మలమాసమున మృతి నొందిన వానికి కాలాంతరేణ మలమాసము ప్రాప్తమగ్యే నేని ఆ మాసముననే తిధిని పెట్టవలయును. నిజ మాసమున చేయుపని లేదు.

—*—

——* శుద్ధమాస మృతస్య ప్రథమాబ్దీక విధిః. *——

శుద్ధ మాసమునందు మృతినొందిన వానికి ౧౩ వ మాసము మలమాసముగా వచ్చిన యెడల ఆ మాసమునందు సాంవత్సరీక విమోకమును ప్రథమాబ్దికమును, చేయవలయును. శుద్ధ మాసము నందు మృతి నొందిన వానికి కాలాంతరేణ ఆ మాసము మలమాసముగా నుండెనేని శుద్ధ మాసమున తిధి పెట్టవలసినది. మలమాసము నందు తిధీ పెట్టవలసినది లేదు.

—*—

—* ద్వాదశాహాదిషు సపిండీకరణే మాసికాపకర్షః. *—

౧౨ వ దినమున సపిండీకరణము ముఖ్యముగా చేయవలెను. ౧౧ వ దినమున మాసికముల నాకర్షించి షోడశశ్రాద్ధము చేయవలెను. షోడశముచేయనిదే సపిండీకరణము చేయరాదు. సపిండీకరణమైన పిమ్మట ఇదే షోడశమును అనుమాసికములుగా సంవత్సరాంతమువరకుచేసి ౩౬౦ దినమున సాంవత్సరీక విమోకముచేసి మృతతిధియందు శ్రాద్ధము చేయవలెను.

—*—

—* త్రిపక్షాదిషు సపిండీకరణమాసిక విధిః. *—

మూడవ పక్షమున సపిండీకరణము చేయు నెడల గతించిన అను మాసికముల పెట్టవలసినదిలేదు. పైన జరుగవలసిన మాసికముల ఆకర్షించి షోడశమునుచేసి సపిండీకరణమును చేయవలెను.

—* సపిండీకరణాత్పూర్వం వృద్ధిశ్రాద్ధ నిషేధః. *—

సపిండీకరణము చేయకమునుపు జ్యేష్ఠుఁడుగాని, కనిష్ఠుఁడుగాని, సపిండులుగాని, సమానోదకులుగాని, నాందీశ్రాద్ధము చేయకూడదు.

—*—

—{ సపిండీ కరణానంతరం వృద్ధిశ్రాద్ధే అనుమాసికాపకర్షః. }—

నామకరణము, అన్నప్రాశనము, చౌలము, గోదానము, పుంసవనము, సీమంతము, స్నాతకము, వివాహము, కన్యాదానము, నూతన గృహప్రవేశము, పట్టాభిషేకము, ఆధానము, సోమము, మహాక్రతువు, ఋతుశాంతి, సన్యాసాశ్రమము, ఈకార్యములు అలభ్యముగా తటస్థించినయెడ అనుమాసికముల నాకర్షించి మృతతిధియందు చేర్చిపెట్టి శుభకార్యములయందు నాందీచేసికొని పునః మాతా పితృవులకు యథావిధిగా మాసికములను క్రమముగా చేయవలెను.

—*—

——* ఊనానాముత్కర్షాపకర్ష నిషేధః. *——

ఊనమాసికములను ఆయా కాలములయందు పెట్టవలసినది. ఆశౌచమువలనగాని, ప్రమాదమువలనగాని నిలిచినయెడల పునఃచేయ నక్కరలేదు.

—*—

——* సపిండీకరణకాలాః - గ్రంథాంతరే. *——

కలియుగమున మృతినొందినవానికి ౧౨ వ దినమున సపిండీకరణము చేయవలెను. ౧౨ వ దినమున చేయుటకు అభ్యంతరమువచ్చినయెడ ౧౧ వ దినమునగాని, ౧౩ వ దినమునగాని, ౨౩ వ దినమునగాని, మూడవ పక్షమునందుగాని, ౩ వ మాసమునందుగాని, ౬ వ మాసమునందుగాని, ౧౧ వ మాసమునందుగాని, సంవత్సరాంతమునందుగాని, అలభ్యముగా నాందీతటస్థించినపుడు పూర్వదినమునందు ఈకాలములయందు సపిండీకరణము చేయవలెను.

—*—

——* సపిండీకరణవారాః. *——

సపిండీకరణము సంప్రాప్తమగుచుండ ౧౨ వ దినము శుక్రవారముగానున్నను మాతాపితృవులకు ఆదినమునసైనను సపిండీ కరణము చేయవచ్చును. వీరుతప్ప ఇతరులకు ఇట్టివారములలో చేయరాదు. వీరికి ౧౩ వ దినమునగాని, పైజెప్పిన దినములలోగాని చేయువచ్చును.

—*—

——* సపిండీకరణకర్తారః. *——

మృతినొందినవారికి స్వకర్తృత్వము పెట్టుకొని స్త్రీగాని, పురుషుఁడుగాని, సపిండీకరణము ఎవరు చేయుచున్నారో వారే తమ జీవితకాలమువరకు ప్రతి సంవత్సరమును శ్రాద్ధము పెట్టుచుండవలయును.

—*—

### —* ఉత్తరక్రమసాపిండవిధిః. *—

తండ్రి మృతినొంది తాత జీవించియుండు నపుడు సపిండీకరణవర్గత్రయమునందు పితామహుని వదలిపెట్టి, (ప్రపితామహుని ఏకావర్తిన్ని, వృద్ధప్రపితామహుని ద్విరావర్తిన్నిచెప్పి) 3 పిండములనుపెట్టి ప్రేతపిండమును మూడు భాగములచేసి పిండసంయోజనమైన పిమ్మట వృద్ధప్రపితామహునికి స్వర్గపాథేయమునిచ్చి మాసికాది శ్రాద్ధములయందు వర్గత్రయము తండ్రిని ద్విరావర్తిచెప్పి ప్రపితామహుని ఏకావర్తిచెప్పి శ్రాద్ధమును చేయుచూరావలయును. పితామహుఁడు మృతినొందిన యథావిధిగా వర్గత్రయము చెప్పవలెను. ఇదేప్రకారముగా తల్లి మృతినొంది పితామహి జీవించియున్నయెడల చేయవలయును. భర్త భార్యకు కర్మచేయు నపుడు తల్లి జీవించి యుండెనేని పైవ్రాసినప్రకారముగా సపిండీకరణము చేయవలయును. ఉత్తరక్రమ మరణము ఎప్పుడు ప్రాప్తమగుచున్నదో అప్పుడెల్లను ఈరీతిగనే చేయవలయును.

—*—

### —* పునఃక్రమసాపిండ్యము. *—

పితామహుఁడు, పితామహి మృతినొందిన పిమ్మట తండ్రికిని, తల్లికిని, భార్యకును, క్రమముగా వర్గత్రయప్రకారము ప్రేతశబ్దము లేక వసురూపముచేత సపిండీకరణము చేయవలెను. స్వర్గపాథేయము లేదు. పితృపితామహప్రపితామహానాం అని వర్గత్రయము యథావిధిగా చెప్పవలయును. ఈవిషయమున దేశాచారము కర్తవ్యము.

—*—

### —* నగ్నప్రచ్ఛాదీనాం పునఃకరణ నిషేధః. *—

తండ్రికి జ్యేష్ఠునిచే దహనము, సంచయనము, నగ్నశ్రాద్ధము మొదలు సపిండీకరణమువఱకు కర్మ పూర్తిచేసినయెడల దేశాంతరమునుండి కనిష్ఠుడు వచ్చెనేని పిమ్మట ౧౦ దినములు ఆశౌచము ఉంచి క్షౌరము చేసికొని ప్రతిదినమును దర్భకూర్చమీద వసురూప

ముచే తిలోదకము విడిచి ౧౦ వ దినమున పునః వపనము గావించు కొని ౧౧ వ దినమున పార్వణశ్రాద్ధము చేయవలెను. పునర్దాహాది కార్యములు సపిండీకరణమైన పిమ్మట చేయకూడదు.

—*—

## ——* జ్యేష్ఠేన పునః సపిండీకరణవిధిః. *——

మాతా పితృవులకు కనిష్ఠునిచే దహనము మొదలు సపిండీ కరణ పర్యంతరము పూర్తిచేయబడిన తర్వాత జ్యేష్ఠుడు దేశాంతర మునుండి వచ్చినయెడ దహనము, సంచయనము, నగ్నశ్రాద్ధము, నిత్యకర్మ, పిండము,దశాహతంత్రము, ఏకోద్దిష్టము, షోడశము, వదలిపెట్టి, వినిన దినమున క్షౌరము చేసికొని ప్రతిదినమును దర్భకూర్చ యందు వసురూపముచే తిలోదక సంఖ్యాప్రకారము ౧౦ దినములు విడిచి ౧౦ వ దినమున క్షౌరముచేసికొని ౧౧ వ దినమున వసురూపముచే సపిండీకరణము చేయవలెను. వైతరణీగోదానము, స్వర్గపాథేయము చేయ నక్కరలేదు.

కనిష్ఠుడు ఏకోద్దిష్టమువరకు కర్మచేసి నిలిపిన యెడల పునఃజ్యేష్ఠుడు శిలాప్రతిష్ఠ మొదలుకొని కర్మ యథావిధిగా చేయవలయును.

—*—

## ——* మాతుస్సాపిండ్యము. *——

కొమారులచే తల్లి యొక్క సపిండీకరణము ఎట్లు చేయవలెన నగా, పితామహీ ప్రపితామహీ వృద్ధప్రపితామహీ వీర్లతోకూడా శ్వశ్రాది సాంపిండ్యము చేయవలసినది.

—*—

## ——* అన్వారోహణే సాపిండ్యం. *——

భార్య, భర్తతోకూడా సహగమనము చేసిన యెడల ఆభార్యకు భర్తతోకూడా సమకాలమునందు సపిండీకరణము చేయవలసినది.

—*—

—*పత్న్యాస్సాపిండ్యం.*—

కొమారులు లేక ఉండి భార్య మృతి నొందిన యెడల భర్త భార్యకు శ్వశ్రాది సపిండీకరణము చేయవలెను.

—*—

—*భర్తృ సాపిండ్యం.*—

భర్త, పుత్రులు, బంధువులు ఎవ్వరు లేని స్త్రీ మృతి నొందిన యెడల ఆస్త్రీకి ఎవరైనను ప్రేతత్వ విముక్తి కొరకు భర్తృ సాపిండ్యము చేయవలసినది. సోదకుంభ శ్రాద్ధమును, అను మాసికములును, సంవత్సర విమోకమును, ప్రతి సంవత్సర శ్రాద్ధమును పెట్ట వలసినది లేదు.

ఈప్రకారముగానే ఎవ్వరులేని పురుషునికి దహనము మొదలు షోడశ శ్రాద్ధము వరకు కర్మ చేసి సపిండీకరణ స్థానమున ముక్తికొఱకు నారాయణ బలిచేసి సోదకుంభము, మాసికములు, సంవత్స విమోకము, శ్రాద్ధములను చేయు బనిలేదు.

—*—

—*పుత్రస్యైవ పితృ సపిండనాధికారః.*—

మృతి నొందినవారి పుత్రులు సన్నిధానమున లేనపుడు శిష్యుండుగాని, బ్రహ్మచారిగాని, ఋత్విక్కుఁడు గాని, పురోహితుఁడుగాని, ఇతరులు గాని, దహనము మొదలు కొని ఏకోద్దిష్టము వరకు కర్మ చేయవచ్చును. సపిండీకరణము మాత్రము చేయకూడదు. పుత్రులే సపిండీకరణము చేయవలెను. మృతి నొందిన వానికి పుత్రులుండియు అన్న మొదలగు వారిచే సపిండీకరణము చేయబడిన యెడల పునః కుమారులు వచ్చినపుడు సపిండీకరణము చేయవలెను.

—*—

—*శ్రాద్ధదినే గృహాలంకార నిషేధః.*—

శ్రాద్ధ దినమునందు గృహమును గోమయముచే నలికి పరిశుద్ధము చేయవలసినది. ముగ్గులచే నలంకరింపరాదు.

—*—

### —* ఉష్ణవారి నిషేధః. *—

మృత దినమునను, పుత్రజన్మమునను, సంక్రాంతులయందును, శ్రాద్ధముల యందును, పుట్టిన దినమునను, అమావాస్య పౌర్ణముల యందును, ఉష్ణోదక స్నానమును చేయరాదు. చేసినయెడ గోవును చంపినంత పాపము సంభవించును.

—*—

### —* దేవతార్చనాది నిషేధః. *—

శ్రాద్ధాత్పూర్వము దానము, అధ్యయనము, దేవతార్చనయు, అవుపాసనము తప్ప ఇతర హోమములును, వ్రతములును, చేయ కూడదు.

—*—

### — జ్యేష్ఠపుత్ర సద్భావే కనిష్ఠస్య సపిండీకరణ కర్తృత్వ నిషేధః. —

జ్యేష్ఠ పుత్రుండుండు నపుడు కనిష్ఠ పుత్రుండు సపిండీకరణ మును చేసిన యెడల ప్రేతత్వముఁ వదలి పితృలోకమునకుఁ బోఁజాలదు.

—*—

### —* సపిండీకరణ స్వరూపము. *—

ప్రేతత్వమును వహించి యుండు తన తండ్రికి ఏకోద్దిష్ట విధానముగా, పితామహాదులకు పార్వణ విధానముగా ఏకోద్దిష్ట ఉభయాత్మక సపిండీకరణమును సమానోదక సాపిండ్య సిద్ధి కొఱకును, వస్వాది పితృలోకమును బొందు నిమిత్తమును, ప్రేతత్వ విముక్తికిని చేయవలెను.

—*—

### —* సపిండీకరణ సంకల్పః. *—

ప్రేతను షష్ఠ్యేకవచనము చేత నిర్దేశించి, తృతీయా విభక్తిచే పితృ పితామహ ప్రపితామహులను చెప్పి, పితృ పితామహ ప్రపితా మహులకు షష్ఠీవిభక్తిచే సంబంధము కలుగ చేయవలెను. ప్రేతయందును, పార్వణయందును, అనుజ్ఞయందును, అర్ఘ్యశేషందును, పిండ

సంయోజనమునందును, ప్రేతకు సంబుద్ధ్యేక వచనమును జెప్పి తృతీయైక వచనముచే పితామహాదులకు సంయోగము చేయవలసినది.

—*—

**సపిండీకరణే పితామహాదీనాం అస్మచ్ఛబ్దేన సంబంధ నిర్దేశన నిషేధకః.**

సపిండీకరణము నందు ప్రేత శబ్దమును చెప్పి తత్పితృ పితామహ ప్రపితామహులని చెప్పవలసినదే కాని అస్మత్పితృ పితామహ ప్రపితా మహులని చెప్పరాదు.

—*—

**—* వృద్ధ శబ్ద నిషేధః. *—**

తండ్రికి కర్మ చేయునప్పుడు పుత్రుడు తండ్రికి పైన ముగ్గురిని చెప్పవలయును. పిండ సంయోజన మైన తరువాత వృద్ధ ప్రపితామహునికి స్వర్గపాథేయము నివ్వవలయును.

—*—

**—* ఆచమనకాలాః. *—**

శ్రాద్ధాదులయందు ఆదియందును, అంత్యమందును, పాద్యమునందును, విష్టరమునందును, ఉచ్ఛిష్టమునందును, పిండదానము నందును కర్త ఆచమనము చేయవలెను.

—*—

**—* నామోచ్చారణ విభక్తి నిర్ణయః. *—**

సంకల్పమునను, ఆసనము వేయునప్పుడును షష్ఠీ విభక్తిని చెప్పవలయును. ఆవాహనయందు ద్వితీయా విభక్తి, దత్తమున చతుర్థీ విభక్తి, తక్కిన కాలములందు సంబుద్ధి చెప్పవలెను. అర్ఘ్యదానము, సంకల్పము, పిండదానము, దర్శ పిట్లయందు గోత్రము, సంబంధము, నామము ఇవి ఎన్నిన్నవో యట్లె చెప్పవలయును.

—*—

**—* ఆశ్వలాయనానాం గోత్రాదుచ్చారణ క్రమః. *—**

మృతి నొందినది మొదలు సపిండీ కరణము వరకు " పితుః -

గోత్రస్య - శర్మణః " అని చెప్పవలసినది. సపిండీ కరణమున పిండ సంయోజనము తరువాత " పితుః - శర్మణః - గోత్రస్య వసురూపస్య " అని ఆశ్వలాయనులు చెప్పవలయును.

—*—

## —* నిమంత్రణీయ బ్రాహ్మణ సంఖ్య. *—

సపిండీ కరణమున ప్రేతస్థానమున ౧ రిని, విశ్వే దేవస్థానమున ౨ రిని, పితృస్థానమున ౩ రిని, విష్ణు స్థానమున ౧ రిని, నిమంత్రణ చెప్పవలయును. రెండవపక్షము—విశ్వేదేవస్థానమున ౧ రిని, ప్రేతస్థానమున ౧ రిని, పితృస్థానమున ౧ రిని, విష్ణుస్థానమున ౧ రిని, ఈ విధముగా ౪ గురు బ్రాహ్మణులను నిమంత్రణ చెప్పవలయును. సపిండీకరణము తప్ప ఇతర శ్రాద్ధములయందును, ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందును, విశ్వే దేవస్థానమున ౧ రిని, పితృస్థానమున ౧ రిని, చెప్పవలయును.

—*—

## —* విష్ణ్వర్చనవిధిః. *—

దర్శయు, మహాలయము, తీర్థ శ్రాద్ధమును, సపిండీకరణమును విష్ణువును ఆరాధించక ఈశ్రాద్ధములును చేసిన ఇవి వ్యర్థము లగుచున్నవి. సపిండీకరణమున మొదట కాల కామ సాంజ్ఞిక విశ్వే దేవతలును అర్చించి యంతమున విష్ణును నర్చింపవలయును. ఈ ప్రకారము చేయనియెడ సపిండీకరణము వ్యర్థము.

—*—

## —* నిమంత్రణవిధిః. *—

నిమంత్రణ బ్రాహ్మణులు స్వశాఖాధ్యయనము చేసిన వారలగ నుండవలయును. వీరు దొరకని యెడ ఇతర శాఖ యందైనను అధ్యయనము చేసిన వారినే చెప్పవలయును. పూర్వ దినముననే బ్రాహ్మణుల చెప్పవలయును.

—*—

—* నిమంత్రణకాలాః. *—

సమస్తములైన ఏకోద్దిష్ట శ్రాద్ధములయందు పూర్వదినమున బ్రాహ్మణుల నిమంత్రణ చెప్పరాదు. సపిండీకరణ శ్రాద్ధమునకు పూర్వదినమున చెప్పవచ్చును.

—*—

—* ఉపవీతవిధిః. *—

స్వాగతము నందును, ఆశీర్వచన కాలమునందును, దక్షిణ ఇచ్చు కాలమునందును, ప్రదక్షిణము చేయునపుడును, నమస్కారము చేయుసమయమునను, అగ్నౌకరణహోమమునందును, ఈ ౬ సమయములయందు ఉపవీతిగా ఉండవలసినది.

—*—

—* పాదప్రక్షాళనేకర్తుః పశ్చిమాభిముఖత్వ నియమః. *—

ప్రాతఃకాలము, మధ్యాహ్న కాలము, సాయంకాలము, రాత్రి కాలము, ఉభయసంధ్యలు, శ్రాద్ధము, ఈకాలములయందు కర్త పశ్చిమాభిముఖుఁడై పాదప్రక్షాళనము చేసికొనవలయును.

—*—

—* పాదప్రక్షాళనే కర్తృభోక్తృ ఉపవేశనవిధిః. *—

బ్రాహ్మణులయొక్క పాదప్రక్షాళన కాలమునందు కర్తా భోక్త ఇద్దరును కూర్చుకొని భోక్తయొక్క పాదములను కర్తప్రక్షాళనము చేయవలెను. ఇట్లు చేయనియెడ కర్త నరకమును పొందుచున్నాడు.

—*—

—* గుల్ఫాదూర్ధ్వం పాదప్రక్షాళన నిషేధః. *—

శ్రాద్ధమునందు గుల్ఫములకు పైన రోమములు తగులక పాదప్రక్షాళన చేయవలెను. ఇట్లుచేయనియెడల పితృదేవతలకు నరకము కలుగుచున్నది.

—*—

—— * పాదాభ్యంగవిధిః. * ——

బ్రాహ్మణులయొక్క పాదములు ప్రక్షాళనమైనపిమ్మట అశుద్ధి నివృత్తికొరకు ఆజ్యస్పర్శనము చేయవలెను. భోక్తలు అభ్యంగనము చేసికొనవలసినది. తిలలు లేక తర్పణము చేయరాదు. ఇట్లు చేయని పక్షమున ఆశ్రాద్ధము రాక్షసప్రీతియగును.

—*—

—— * శ్రాద్ధదినే కర్తృభోక్తృణా ఆశౌచప్రసంగే. * ——

శ్రాద్ధకర్మ ప్రారంభమగుచుండగా నిమంత్రణ చెప్పిన బ్రాహ్మణులకు క్షణమిచ్చిన తర్వాత భోక్తలకు ఆశౌచమువచ్చిన అసీమాంతమగువరకు ఆశౌచములేదు. శ్రాద్ధము యథావిధిగా జరుపవచ్చును.

—*—

వ్రతములు, యజ్ఞము, వివాహము, శ్రాద్ధము, హోమార్చన, జపము, ఈకార్యములయందు సంకల్పముచేసి ప్రారంభించిన తర్వాత అవి పూర్తియగువరకును కర్తకు జాతాశౌచ మృతాశౌచములు లేవు.

—*—

—— * ఆపద్విషయ అశక్తవిషయశ్చ. * ——

పైనవ్రాసిన కార్యములు చేయుసమయమున మధ్య కర్తకు ఆశౌచమువచ్చిన సచేల స్నానముచేసి తానే శ్రాద్ధమును చేయవలెను. పక్వాన్నమును ఆశౌచములేనివారు వడ్డించవలయును. దత్తమవుడు భోక్తనే అన్నముమీదుగా ప్రోక్షణ చేసికొనవలయును. ఈవిషయమునగూడ దేశాచారమే కర్తవ్యము.

—*—

—— * ఉపవేశనవిధిః. * ——

విశ్వేదేవతలు తూర్పుముఖముగను, పితృదేవతలు ఉత్తరముఖముగను ప్రేతస్థాన బ్రాహ్మణుడు పశ్చిమాభిముఖముగను, విష్ణువు

పూర్వాభిముఖముగను, పశ్చిమాభిముఖముగనైనను కూర్చుండవలయును.

—*—

—* అర్చనాది విధిః. *—

విశ్వేదేవతులను అర్చించునపుడు కర్త ఉత్తరముఖముగాను, పితృదేవతుల నర్చించునపుడు దక్షిణాభిముఖుఁడుగను, పిండప్రదానకాలమున పూర్వాభిముఖముగనుకూర్చుండవలయును. మొదట విశ్వేదేవతులను నర్చింపవలయును.

—*—

—* జానునిక్షేపవిధిః. *—

కర్త విశ్వేదేవతుల నర్చించునపుడు కుడిమోకాలును భూమియందునిచి పూజ చేయవలయును. ఎడమమోకాలును భూమిపైనుంచి పితృదేవతులను పూజింపవలయును.

—*—

—* పూజనవిధిః. *—

విశ్వేదేవతులను పాదము మొదలు శిరస్సువరకు పూజచేయవలెను. శిరస్సు మొదలుకొని పాదములవరకు పితృదేవతుల నర్చింపవలయును.

—*—

—* అర్ఘ్యసంయోజన పిండసంయోజనవిధిః. *—

ఏకకాలమున ప్రేతస్థానబ్రాహ్మణుని యెదుట ఒకదొప్పనుంచి దానికి పశ్చిమ వాయువ్య ఆగ్నేయాంతముగా మూడుదొప్పలనుంచవలసినది. అటుపిమ్మట పితృపాత్రలయందు "ఆమ ఆగంత" అను మంత్రముచేత ఆమూడు దొప్పలయందు దక్షిణపు దిక్కుననుండి ఉదకమును వేయవలెను. పిమ్మట పితృపాత్రలయందు ఆయామంత్రములచే తిలలును, తేనెను ఉంచవలసినది. "సోమస్య" యను మంత్రముచే ఆమూడు దొప్పలలోని ఉదకమును దర్భచే కలియబెట్టి ఆద

ర్భలును త్రుంచి శిరస్సునకు వెనుక భాగమున పారవేసి ఉదకమును స్పృశించ వలసినది. పిమ్మట "శంనో్దేవీ" అను మంత్రము మొదలు ఆవాహనవరకుచేసి ఎడమచేతి అనామికచే భూమిని స్పృశించి "ఏపార్థివా" అను మంత్రముచే కర్తయందు దక్షిణపు దిక్కున అగ్నినుంచి ఈ మంత్రము చెప్పి ఆయగ్నిని చల్లార్చి అటు పిమ్మట అర్ఘ్యసంయోజన సంకల్పము చెప్పి ప్రేతపాత్రయందున్న ఉదకమును కొంతదీసి "సమానీవ ఆకూతిః" అను మంత్రముచే ప్రేత యొక్క పాత్రయందుంచి "ఏసమానా" అను మంత్రమును జెప్పుచు దొప్పనుమూసి మంత్రమును చెప్పి నారాయణ స్మరణ చేయవలెను. ఈ ప్రకారముగనే పితామహ ప్రపితా మహులకు అర్ఘ్యసంయోజన మివ్వవలెను. పిమ్మట ప్రేతకును, పితృ, పితామహ, ప్రపితామహులకును హస్తోదకమిచ్చి యథావిధిగా నర్చింప వలయును.

బ్రాహ్మణ భోజనమైన పిమ్మట పూర్వాభి ముఖముగా కూర్చుని పిండ ప్రదానమునకు సంకల్పముచేసి ప్రేత పిండమును జేసి ఒక దర్భయందునిచి తిలోదకము విడిచి, ఈపిండమునకు దక్షిణ భాగమునందు సకృదాచ్ఛిన్నములను పరిచి తత్ప్రత్రాది మూడు పిండముల నునిచి ఈ మూడు పిండములయందు మంత్రముచే తేనె నుంచి పిండ సంయోజన సంకల్పముచేసి ప్రేత పిండమును దర్భ రజ్జుచేత మూడు భాగములు జేసి ఈ మూడు భాగములయందు మంత్రము లేక తేనె నుంచి ప్రథమ భాగమును "సంగచ్ఛధ్వగ్ం" అను రెండు మంత్రములచే పితృ పిండముతో సంయోగము చేయవలసినది. ఈ ప్రకారముగానే కడమ రెండు భాగములను పితామహ ప్రపితామహ పిండములతో సంయోజనముచేసి పిమ్మట "ఏషా ఉనుగత ప్రేతా" అను పురాణమంత్రమును చెప్పి కర్త "ఇతః పరం ప్రేత శబ్దోనాస్తి" అని చెప్పవలయును. పిమ్మట వైతరణీ గోదానము చేయ వలయును. బ్రాహ్మణ విసర్జనచేసి, ఆ సీమాంతమును పూర్తిచేసి, పిండముల నుదకమునందు వేసి, పిమ్మట అభ్యంగనము చేసికొని, యజ్ఞోపవీత

ములను వేసికొని కర్మణః పుణ్యాహవాచనమును చేసికొని, శుభస్వీకరణమును జేసికొన వలయును.

—*—

## —* అర్ఘ్యసంయోజనే విభక్త్యుచ్చారణ విధిః. *—

సంబుద్ధ్యేకవచనముచే ప్రేతార్ఘ్యమును కొంత దీసికొని తత్పితృ పాత్రయందున్న ఉదకముతో గూడ తృతీయా విభక్త్యేక వచనముచే సంయోగము చేయువలయును. ఈవిధముగనే పితామహ ప్రపితామహులకు తృతీయా విభక్తిచే నర్ఘ్య సంయోజనము చేయవలెను. ఇదే ప్రకారము సంబుద్ధ్యేక వచనముచేత ప్రేత పిండ భాగములను తీసికొని తృతీయా యైకవచనముచేత తత్పితృ పితామహ ప్రపితామహుల యొక్క పిండములతో సంయోజనము చేయవలెను.

—*—

## —* అర్ఘ్యసంయోజనకాలే అగ్నిసిదాన విధిః. *—

కర్త పూర్వాభిముఖముగా కూర్చుని పృష్ఠ భాగమునందు అంగుష్ఠ మధ్యమములచే భూమిని స్పృశించి పిమ్మట లౌకికాగ్ని తీసికొని వచ్చి కర్తయొక్క వెనుక పార్శ్వమునం దుంచవలయును. ఈ అగ్నిని కర్త చూడ కూడదు.

—*—

## —* గంధాదిదానే ప్రాచీనావీత విధిః. *—

కర్త ప్రాచీన వీతి చేసికొని ప్రేత పితృ స్థానములయందు హస్తోదకమిచ్చి గంధము, పుష్పము, ధూపము, దీపము, వస్త్రము వీట్లను యథాశక్తిగా ఇవ్వవలసినది.

—*—

## —* మధ్యే హస్తోదక దానాభావే విధిః. *—

బ్రాహ్మణులకు ఆసనము వేయునపుడును, అర్చించు నపుడును, హస్తోదకమును నియ్యని యెడల పితృదేవతలు నిరాశులై పోవుదురు.

—*—

—— * అగ్నౌకరణ విధిః. * ——

బ్రాహ్మణుల కొఱకు ఏ యన్నము చేయబడినదో ఆ అన్నముచే నగ్నౌకరణమును, పిండ ప్రదానమును చేయువలసినది.

—*—

—— * అగ్నౌకరణాగ్ని నిర్ణయః. * ——

మాతా పితృలకు సపిండీ కరణమునందు అగ్నౌకరణ హోమమును అవుపాస నాగ్నియందున చేయవలసినది. జ్ఞాతులకును, ఇతరులకును లౌకి కాగ్నియందున చేయవలసినది. సాగ్నికుఁడు, మాతా పితృవులు, సాపత్నీమాతృ, మాతామహులు, జ్యేష్ఠభ్రాత, పెత్తండ్రి, పినతండ్రులు, పీర్లకు అవుపాస నాగ్నియందు అగ్నౌకరణము చేయవలసినది. ఇతరులకు లౌకి కాగ్ని యందు చేయవలసినది. ఆపస్తంబులకు పాణిహోమము లేదు.

—*—

—— * విదురాది కర్తృత్వే. * ——

సపిండీకరణ శ్రాద్ధము మొదలగు వాట్లయందు స్నాతకుఁడును, అపత్నీకుఁడును. బ్రహ్మచారియును అగ్నౌకరణ హోమమును లౌకి కాగ్నియందే చేయవలెను.

—*—

—— * అసన్నిహిత భార్యా స్సాగ్నౌకరణ నిర్ణయః. * ——

కర్తయెకట భార్య సమీపమున లేనపుడును, ప్రమాదము వలన అవుపాసనాగ్ని చల్లారి పోయి నపుడును, మాతా పితృవుల శ్మశానాగ్ని చల్లారి పోయినపుడును, పునః అగ్నిహోత్రమును మధించుకొని ఆ యగ్నియందున పైచెప్పబడిన కార్యములను చేయవలెను. ఆశ్వలాయన శాఖులు అగ్నిహోత్రమును మధించుకొని, లాజ హోమము భార్యతోకూడ కూడుకొని అవుపాసనమును చేసికొనవలయును.

—*—

—— * అగ్నౌకరణ హోమ ప్రకారః. * ——

అగ్నౌకరణ హోమమును చేయునపుడు ప్రాచీనావీతి చేసికొని అన్నమును తీసికొని సవ్యము చేసికొని అగ్నియందు హోమము చేయవలసినది. ఈప్రకారముగా రెండు ఆహుతులున్ను చేసి ప్రాచీనావీతి చేసికొని ఉత్తర పరిషేచనము చేయవలయును.

—*—

—— * ఆహుతి త్రయ నిషేధః. * ——

ఆహితాగ్నులు అగ్నౌకరణ హోమము చేయు నపుడు మూడు ఆహుతులు చేయవలెను. అనాహితాగ్నులు, అగ్నౌకరణ హోమమును చేయు నపుడు రెండు ఆహుతులను చేయ వలసినది. " యమాయ " ఆహుతి చేయ నక్కర లేదు.

—*—

—— * ప్రేతాహుతే అగ్నినిర్ణయః. * ——

కర్త మాతా పితృవులకు సపిండీకరణముచేయునపుడు అవుపాసనాగ్నిలో కొంతదక్షిణపు భాగమందున్న అగ్ని పరిస్తరణముల ప్రక్కగా తీసికొని ఆయగ్నియందున ప్రేతాహుతిని చేయవలెను. ఆ యగ్నియే లౌకికాగ్ని. ఈయగ్నిని పునః అవుపాసనాగ్నియందు చేర్చుకొనవలెను.

—*—

—— * ప్రేతాహుతి హోమప్రకారః. * ——

అవుపాస నాగ్నియందుండి వెలుపలకుఁ దీసిన అగ్నియందు ప్రేతయొక్క గోత్రనామము చెప్పి " ప్రేతాయ యమాయచ స్వాహా " అని హోమము చేయవలసినది.

—*—

—— * సపిండీకరణే అన్నసూక్త నిషేధః. * ——

ప్రేతశ్రాద్ధములయందును, సపిండీకరణమునను, అను మాసికముల యందును, సంవత్సర విమోకమునందును అన్నసూక్తమును చెప్పఁ బనిలేదు.

—— * ఘృతపాత్ర నిధానం. * ——

సూపము నందుగాని, పాయసము నందుగాని నేతి దొప్ప నుంచి ఆ నెయ్యిని భుజించిన పక్షమున నా శ్రాద్ధము రాక్షస ప్రీతి యగును. శ్రాద్ధ కర్త నరకమును బొందుచున్నాడు.

—*—

—— * చిత్రగుప్తబలి నిషేధః. * ——

భోక్తకు అన్నమునువడ్డించి దత్తమైన పిమ్మట భోక్త చిత్రగుప్తబలి పెట్టిన యెడల ఆయన్నము వ్యర్థమగును. పితృదేవతులు నిరాశులై పోవుదురు.

—*—

—— * సువాసినీ భోజనవిధిః. * ——

సువాసినీ మృతినొందిన యెడల సపిండీకరణ శ్రాద్ధమునను శ్రాద్ధాదులయందును మాసికాదులయందును బ్రాహ్మణులతో గూడ సమపఙ్క్తిగాకూర్చుండబెట్టి మంత్రములేక భోజనముపెట్టవలసినది.

—*—

—— * పితృసూక్తనిషేధః. * ——

తీర్థశ్రాద్ధమందును, గయాశ్రాద్ధమందును, నిత్యశ్రాద్ధమందును, ప్రేతశ్రాద్ధమందును, సపిండీకరణశ్రాద్ధమందును, షోడశములందును, అనుమాసికముల యందును, సోదకుంభ శ్రాద్ధమందును, సంవత్సర విమోకమునందును, అథిశ్రవణము చెప్పరాదు.

—*—

—— * అపేక్షితదానాభావే నిషేధః. * ——

శ్రాద్ధాదులయందు భోక్తలకొఱకు చేసిన పదార్థములను కావలసిన వరకు వడ్డించని యెడల ఆకర్త అధోగతిని పొంది తిర్యగ్యోనులయందు ఉద్భవించుచున్నాడు.

—*—

—— * పిండదూషణే. * ——

పిండముల పెట్టిన పిమ్మట పిల్లి, యెలుక తాకినేని, పిండములు

విరిసిపోయినను, తత్క్షణమే ఆపిండములను పారవేసి శ్రాద్ధాన్నమును తీసికొనివచ్చి యథావిధిగా పిండప్రదానమును చేయవలసినది.

—*—

——* గ్రంథాంతరే. *——

పితృపిండము పగిలినను, పితృస్థానమున గూర్చున్న బ్రాహ్మణునకు వమనమైనను, అగ్నౌకరణాగ్ని చల్లారినను, ఆదినమంతయు కర్తనుపవాసము ఉండి మరుదినమున ఈబ్రాహ్మణులనే చెప్పి పునః శ్రాద్ధమును చేయవలెను.

—*—

——* భోక్తుర్వమనే. *——

పిండప్రదానము చేయకమునుపు పితృస్థానమున గూర్చున్న బ్రాహ్మణుడు వమనము చేసికొనిన యెడల ఆబ్రాహ్మణుని వదలిపెట్టి మరియొకరిని చెప్పి పునః అప్పుడే వంటచేసి పునః శ్రాద్ధమును చేయవలసినది. అవకాశము లేనట్లైన కర్త ఆదినమంతయు ఉపవాసముండి మరుదినము శ్రాద్ధము చేయవలసినది. పితామహ, ప్రపితామహ, విశ్వేదేవ, విష్ణుస్థానములయందు కూర్చున్న బ్రాహ్మణుడు వమనము చేసికొనిన యెడల ఆబ్రాహ్మణుని విడిచి లౌకికాగ్నిని తెచ్చి ఆయగ్నికి సమీపమున విస్తరివేసి శ్రాద్ధాన్నము వడ్డించి, కర్త సంకల్పము చేసి ప్రణవముచేత ౩౨ ఆహుతులను అగ్నియందు "ఓంప్రాణాయస్వాహా" ఈప్రకారము పంచమంత్రములచేత అన్నమును హోమముచేసి పితృస్థానమున బ్రాహ్మణునికి భోజనమైన పిమ్మట యథావిధిగా శ్రాద్ధమును చేయవలెను. అన్నిశాఖులకు ఈవిధిప్రకారముగనే చేయవలెను.

సపిండీకరణమున ప్రేతస్థానమున గూర్చున్న బ్రాహ్మణుడు వమనము చేసికొనిన యెడల ఆబ్రాహ్మణుని వదలిపెట్టి మరియొక బ్రాహ్మణుని చెప్పి పునః అప్పుడే పాకముచేసి సపిండీకరణమును చేయవలసినది. సాధ్యపడని పక్షమున మరుదినము సపిండీకరణ శ్రాద్ధమును చేయవలెను.

## —* మాసికాదిషువమనే. *—

అనుమాసికములయందును, గయాశ్రాద్ధమందును, ప్రత్యాబ్ధికమునందును, మహాలయమునందును, పితృస్థానమున గూర్చున్న బ్రాహ్మణుఁడు వమనము చేసికొనిన పునః శ్రాద్ధమును చేయవలసినది.

—*—

## —* సంక్రాంతి శ్రాద్ధాదిషువమనే. *—

సంక్రాంతియందును, వ్యతీపాతయందును, యుగాదులయందును, అష్టకాదులయందును, దర్శయందును, పితృస్థానమున గూర్చున్న బ్రాహ్మణుఁడు వమనము చేసికొనినయెడల పునః శ్రాద్ధము చేయనక్కరలేదు. పిండప్రదానమైన పిమ్మట భోక్తలు వమనము చేసికొనిన యెడల పునః శ్రాద్ధమును చేయవలయును.

—*—

## —* భోక్తౄణాం అన్యోన్యస్పర్శే. *—

శ్రాద్ధపఙ్క్తియందును భోజనము చేయుచున్న బ్రాహ్మణుఁడు మరియొక బ్రాహ్మణుని స్పృశించిన యెడల ఆయన్నమును వదిలిపెట్టి వేరే యన్నమును భోజనము చేయవలెను. అట్లు తెప్పించుకొని భోజనము చేయకపోయిన మరుదినమున ౧౦౮ మార్లు గాయత్రీజపమును చేయవలసినది.

—*—

## —* ఉచ్ఛిష్టసంపర్కే. *—

భోక్తలు భోజనము చేయునపుడు విస్తరియందున్న అన్నము మరియొక విస్తరియందు పడిన ఆవిస్తర్లను, ఆయన్నమును వదలిపెట్టి ఆస్థలమును శుద్ధిచేసి వేరేవిస్తర్లు వేసి అన్నమును వడ్డించి గాయత్రీ ప్రోక్షణచేసి బ్రాహ్మణులకు భోజనము పెట్టవలసినది. భోజనమైన పిమ్మట భోక్తలు అప్పుడే స్నానము చేసి ౧౦౮ గాయత్రీ జపము చేయవలసినది.

—*—

——* ఆద్యశ్రాద్ధే వమనవిధిః. *——

ఆద్యశ్రాద్ధమునందు కూర్చున్నబ్రాహ్మణుఁడు వమనము చేసికొనినయెడల "యత్తేకృష్ణేతి" అను మంత్రముచేతను ౩౨ ఆహుతులను అన్నమును యథావిధిగా లౌకికాగ్నియందు హోమము చేయవలసినది. పునః బ్రాహ్మణునికి భోజనము పెట్టవలసినది.

—*—

——* షోడశశ్రాద్ధే వమనవిధిః. *——

షోడశ శ్రాద్ధమున భోక్తవమనము చేసికొనినయెడల యథావిధిగా లౌకికాగ్నియందు ప్రేతాహుతి హోమమునుచేసి ఆబ్రాహ్మణునికి భోజనము పెట్టవలసినది.

—*—

——* వైతరణీగోదానవిధిః. *——

ప్రేతలోకమునుండి పితృలోకమునకు పోవు నిమిత్తమును, మార్గమధ్యమున వైతరణీనదిని కష్టము లేక దాటుట కొరకును వైతరణీ గోదానమును చేయవలయును.

—*—

——* దానప్రకారః. *——

గోదానమును చేయు దాత పరిశుద్ధుఁడై, శిరస్సు వెంట్రుకలను ముడివేసికొని, ఉత్తరముగా కూర్చుకొని దానమును గ్రహించుకొనుట కర్హుడైన బ్రాహ్మణునిచూచి, తనయొక్క హస్తమున బంగారుతోకూడా ఆజ్యపాత్రనుంచుకొని ఆగోవుయొక్క తోకను ఆజ్యపాత్రయందుంచి తాంబూలమునుంచి దానమును తీసికొను బ్రాహ్మణుని తూర్పుముఖునిగా కూర్చుండబెట్టి యాబ్రాహ్మణుని హస్తమందు కుశ సహితమైన ఉదకమును ఉంచి దానమునుచేసి దక్షిణ ఇవ్వవలయును.

—*—

——* స్వర్గపాథేయ శ్రాద్ధము. *——

సపిండీకరణ పిండసంయోజనము పిమ్మట ప్రేతత్వనివృత్తియైన

పిదప నాలుగవ పురుషునికి ఆమముగా స్వర్గ పాథేయ శ్రాద్ధమును చేయవలయును. మార్జనాది క్రియలు లేవు.

—*—

## —* దక్షిణదానము. *—

విశ్వేదేవతులకు దక్షిణ బంగారు ఇవ్వవలయును. పితృదేవతులకు వెండియు ఉభయులకు శక్త్యాను సారముగా దక్షిణ ఇవ్వవలయును.

—*—

## —* సపిండీకరణే తర్పణవిధిః. *—

సపిండీకరణమునందును, అనుమాసికమునందును, సంవత్సర విమోకమునందును తిల తర్పణమును అప్పుడే చేయవలసినది. మరు దినము చేయరాదు.

సపిండీకరణమైన పిదప అనుమాసికమునుచేసి వైశ్వదేవము చేసి శ్రాద్ధాంగ తర్పణమును చేయవలెను.

—*—

## —* ఉదకుంభవిధిః. *—

సపిండీకరణమైన పిమ్మట స్నానముచేసి యజ్ఞోపవీతములను వేసికొని కర్మణఃపుణ్యాహవాచనమైన పిమ్మట సంకల్ప విధానముగా అన్నశ్రాద్ధమును చేయుసమయమున బ్రాహ్మణుని కొరకు దక్షిణ సహితమైన ఉదకుంభము ఇవ్వవలసినది.

—*—

## —* మాసోదక కుంభవిధీః. *—

ప్రతి మాసమునందును, మృత దినమునందును, అను మాసికమైన తర్వాత ఆదినమే సోదకుంభ శ్రాద్ధమును చేసి సంవత్సర విమోకమగు వరకు ప్రతి మాసమునందును చేయవలెను.

—*—

## —* శతైకోద్దిష్టాని. *—

నగ్న శ్రాద్ధము ౧, తిలోదకములు ౭౫, నవ శ్రాద్ధము ౬,

షోడశము ౧౬, ఆద్యశ్రాద్ధము ౧, సపిండీకరణము ౧, ఈ శ్రాద్ధములను మృతి నొందినవారి మేలుకొరకు చేయవలెను. ఇట్లు చేయని యెడల వారు నరకమును బొందుచున్నారు. మృతి నొందిన వాఁడు ప్రేత లోకమునందే ఉండును. సద్గతిని పొందనేరడు.

—*—

——* ప్రేతాహుతి శేషస్య అభోజ్యత్వం. *——

ప్రేతాహుతి అయిన పిమ్మట శేషాన్నమును ప్రేతస్థానమున కూర్చున్న బ్రాహ్మణుని విస్తరియందు పెట్ట వలసినది. పితృ పితామహ ప్రపితామహ స్థానములయందు కూర్చుకొన్న బ్రాహ్మణుల విస్తర్లయందు పెట్టకూడదు. అట్లు పెట్టిన యెడల కర్త రౌరవాది నరకమును బొందుచున్నాడు. అప్పుడే యావిస్తర్లను తీసి పారవైచి వేరే విస్తర్లనువేసి అగ్నౌకరణ శేషాన్నమును పెట్టవలెను.

—*—

——* కర్తుః శ్రాద్ధ శేషాన్నభోజనవిధిః. *——

కర్త శ్రాద్ధమును పెట్టిన పిమ్మట పితృ శేషమును భుజించవలయును. కర్త పితృశేషమును భుజించకపోయిన పితృ విశ్వేదేవతలును హవ్యకవ్యములను పుచ్చుకొనరు.

—*—

——* ఏకోద్దిష్ట శ్రాద్ధాన్నభోజన నిషేధః. *——

ఏకోద్దిష్ట శ్రాద్ధాన్న శేషమును, చంద్ర సూర్యోపరాగ శ్రాద్ధాన్న శేషమును, కర్త సహితము భుజింపరాదు. మరియు నవ శ్రాద్ధ ఆద్యాది షోడశ శ్రాద్ధ శేషాన్నమును సహితము భుజింపరాదు.

—*—

——* ఉపవాసే శ్రాద్ధశేషాన్న భోజననిషేధః. *——

ఊపవాస దినమునందు నిత్యనైమిత్తిక శ్రాద్ధము సంప్రాప్తమగునెడ పితృ శేషాన్నమును భుజింపక ఆఘ్రాణము మాత్రముచేసి యా దినమున ఉపవాసము వ్రతము సలుప కొనవలయును.

—* భిన్నగోత్రాణాం పితృశేషభోజన నిషేధః. *—

భిన్నగోత్రులును, స్నాతక బ్రహ్మచారులును, విధవులును, సన్యాసులును పితృ శేషాన్నమును భుజింపరాదు.

—*—

—* గ్రంథాంతరే. *—

మామ, గురువు, మేనమామ, మహాత్ములు, అన్న, పుత్రుఁడు, బ్రహ్మ నిష్టకలవాఁడు, అష్టాంగ యోగాభ్యాసి వీరు శ్రాద్ధశేషాన్నమును భుజింపవచ్చును.

—*—

—* శూద్రస్య పితృశేషాన్న దాననిషేధః. *—

శ్రాద్ధ దినమున గృహమునందు శూద్రునికి పితృ శేషాన్నమును పెట్టకూడదు. అట్లు చేసిన యెడల పితృ దేవతలు అచ్చోట నుండక తత్క్షణమే వెళ్లిపోవుచున్నారు. కర్త రౌరవాది నరకమును బొందుచున్నాడు.

—*—

— ఆశౌచమధ్యే ప్రాప్త ప్రత్యాబ్దికస్య తదనంతరం శూన్యతిథౌ నిషేధః. —

జాతాశౌచ మృతాశౌచ మధ్యమునందు మాతా పితృవులకు మొదలగు వారియొక్క తిథులు వచ్చిన యెడల ఆమృత తిథులనువిడిచి పెట్టి ఆశౌచాంతమునందు పెట్టవలసినది. ఆశౌచాంతమున శూన్య తిథి వచ్చిన యెడల ఆదినమున తిథి పెట్టకూడదు.

—*—

—* శూన్యతిథ్యంతర దినే కర్తవ్యత్వ విధిః. *—

ఆశౌచాంత దినమున రాబడిన శూన్య తిథియందు కర్త ఉపవాసము ఉండి మరుదినమున యథావిధిగా తిథి పెట్టవలసినది.

—*—

—* సంవత్సర విమోక శ్రాద్ధవిధిః. *—

సంవత్సరాంతమున శూన్య తిథి వచ్చినప్పటికిన్ని సంవత్సర

విమోకమును శ్రాద్ధమును ఆదినమునందే తప్పక పెట్టవలసినది. శూన్య తిథి దోషము లేదు. ఆ దినము తప్పిన యెడల సంవత్సర విమోకము నకు వేరు కాలము లేదు.

—*—

## సంవత్సర విమోకశ్రాద్ధంవినా ప్రథమాబ్దిక ఫలాభావః.

సంవత్సరాంతమునందు సంవత్సర విమోక శ్రాద్ధమును పెట్టక ప్రథమాబ్దికమును చేసిన యెడల యాశ్రాద్ధమును వ్యర్థము.

—*—

## సూతకాదినా స్వకాలాతిక్రమే పునర్విమోక నిషేధః.

సంవత్సరాంతమున ఆశౌచము మొదలైన కారణములచే సంవత్సరవిమోక శ్రాద్ధము నిలిచిన యెడల ఆశౌచాంతమున నాశ్రాద్ధమును చేయ నకఱలేదు. తిథిని మాత్రము పెట్టవలయును.

—*—

## * వర్షాంతసాపిండ్యే ప్రథమాబ్దికవిధిః. *

సంవత్సరము లోపల కర్మచేయుటకు సందర్భము లేనియెడల సంవత్సరాంతమున మృత మాస, మృత తిథియందు సపిండీ కరణమును యథావిధిగా చేయవలసినది. అదియే ప్రథమాబ్దికమని చెప్పబడుచున్నది.

—*—

## సపిండీ కరణానంతరం బ్రహ్మచర్య నియమాభావః.

మాతా పితృవులకు సపిండీకరణమును చేసినపిదప కర్త బ్రహ్మచర్యవ్రతము ఉండవలసినది లేదు. అట్లున్న యెడల విశేషఫలముకలదు.

—*—

## * అనుమాసిక విధిః. *

౧౨వ దినమున సపిండీకరణానంతరం ఊనమాసికమును చేయ

వలసినది. తప్పిన యెడల ౧౩ వ దినమున దిన వార శుద్ధి చూడకనే చేయవచ్చును. ఈ దినములు తప్పిన యెడల ౨౬ దినములకు మీద ౨౭, ౨౯, ౩౦, ఈ దినములలో దిన వార శుద్ధిచూచి ఊనమాసికమును పెట్టవలసినది. ౩౦ దినమున దిన వార శుద్ధిచూడకనే తప్పక చేయవలసినది. ఆదినము తప్పిన యెడల ఊనమాసికమునకు కాలము లేదు. అటు పిమ్మట చేయకూడదు.

---*---

## ——* త్రైపక్షిక మాసికవిధిః. *——

ద్వితీయ మాసికమును చేసినపిమ్మట ౫ దినముల లోపలగాని, ౪౦ దినములకు పైన ౫ దినములకు లోగాగాని దిన వార శుద్ధిచూచుకొని త్రైపక్షిక మాసికమును చేయవలసినది. దిన వార శుద్ధికుదరని పక్షమున ౩౫ వ దినమున గాని ౪౫ వ దినమున గాని తప్పక చేయవలసినది. ఆ దినము తప్పిన యెడల పునః పెట్టడమునకు కాలము లేదు.

---*---

## ——* ఊనషాణ్మాసికవిధిః. *——

షాణ్మాసికమును పెట్టిన పిమ్మట ౧౨ వ పక్షమున ౫ దినములు వెళ్ళిన పిమ్మట ౫ దినములలోపల ౧౬౦ దినములకుపైన ౧౦ దినములకులోపల దిన వార శుద్ధిచూచి ఊన షాణ్మాసికమును పెట్టవలయును. దిన వార శుద్ధి కుదురకపోయిన పైఁ జెప్పిన యంత్యదినములయందు తప్పక పెట్టవలసినది. అదితప్పిన వేరుదినము లేదు.

---*---

## ——* ఊనాబ్దిక మాసిక విధిః. *——

౨౪ వ పక్షమునందు ౧౦ దినములకు పైన ౫ దినములకు లోపలగాని అనగా, ౩౫౫ దినములకు మీద ౫ దినముల లోపల దిన వార శుద్ధిచూచి ఊనాబ్దిక మాసికమును పెట్టవలసినది. దిన వార శుద్ధి కుదరకపోయిన ఎట్టి దినమైనను సంవత్సర విమోకము ముందు దినమున తప్పక చేయవలసినది.

—* ఊనానాం వర్జకాలాః. *—

నందతిథి, శుక్రవారము, చతుర్దశి, ద్విపుష్కర త్రిపుష్కర దినములును, శనివారముతో కూడుకొనిన అమావాస్య, త్రయోదశి, కృత్తికానక్షత్రము, ఆదివారము, మంగళవారము, జన్మతార, ఈదినములు త్రైపక్షిక, ఊనషాణ్మాసిక, ఊనాబ్దికమాసికములకు వర్జితకాలములు. ఈదినములలో చేయరాదు. అంత్యదినములందు ఇట్టి దోషములున్నను తప్పక చేయవలసినది.

—*—

—* ఊనానాం వర్జనక్షత్రాణి. *—

కృత్తిక, జ్యేష్ఠ, ఆశ్లేష, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, మూల, రోహిణి, ధనిష్ఠాపంచకము, ద్విపాది త్రిపాది నక్షత్రములు, మఖ ఈ నక్షత్రములయందు ఊనత్రయములను పెట్టరాదు. అంత్యదినములకు ఈనక్షత్రదోషములు లేవు.

—*—

—* గ్రంథాంతరే. *—

హస్త, చిత్త, భరణి, స్వాతి, శ్రవణం, అశ్విని, మఖ, అనూరాధ, రేవతి, శతభిషము, మృగశిర, ఈ ౧౧ నక్షత్రములయందు ఊనమాసికములను చేయవచ్చును.

—*—

—* అనేక మాసికాతిక్రమణే. *—

ప్రతిమాసమునందును మృతతిథియందు అనుమాసికములను పెట్టవలయును. అసందర్భముచేత నిలిచిన యెడల మరుసటినెల మాసికముతోచేర్చి అతిపన్నముగా చేర్చుకొని పితృస్థానమున ఇద్దఱు బ్రాహ్మణులఁజెప్పి ప్రత్యేక ప్రత్యేకముగా ఇద్దఱివద్ద అర్ఘ్యపాత్రలనుంచి వేర్వేరుగా అర్ఘ్యమునిచ్చి ౬ పిండములను పెట్టవలెను. మూడుమాసికములు అయిన తర్వాత మాసికము నిలిచిన యెడల ఒక బ్రాహ్మణునినే చెప్పి, 3 అర్ఘ్యములను, 3 పిండములనే పెట్టవలయును.

## దేశాంతరగత భ్రాతౄణాం ప్రత్యాబ్దికానుమాసికామావాస్యా విధిః.

అన్నదమ్ములు విభక్తులైనను, అవిభక్తులైనను దేశాంతరమందున్నపుడు మాతాపితృవులకు మృతదినమునందు ప్రత్యాబ్దికమును, అనుమాసికమును, దర్శశ్రాద్ధమును వేర్వేరుగా చేయవలెను.

—*—

## * దుష్టనక్షత్రాణి మరణే గృహత్యాగవిధిః. *

ద్విపాది నక్షత్రములయందును, త్రిపాది నక్షత్రములయందు, ధనిష్ఠా పంచక నక్షత్రములయందును, మృతినొందిన, ద్విపాది నక్షత్రములకు ౨ మాసములును, త్రిపాది నక్షత్రములకు ౩ మాసములును, ధనిష్ఠ మొదలు ౫ నక్షత్రముల వరకు ౬ మాసములును, భద్ర తిథికి ౩ మాసములును కర్మాంతమున గృహమును వదిలి వేయవలెను. పైజెప్పిన కాలములు వెళ్ళిన తర్వాత పాడుతీసివేసి గృహముశుద్ధిచేసి పుణ్యాహవాచనము గృహయజ్ఞమును చేయవలెను.

—*—

## * సపిండీకరణాత్పూర్వం శ్రాద్ధాంతరనిషేధః. *

మృతినొందిన ప్రథమ సంవత్సరమునందు సపిండీకరణాత్పూర్వము దర్శశ్రాద్ధమును, గయాశ్రాద్ధమును, తీర్థశ్రాద్ధమును, మహాలయమును చేయరాదు.

—*—

## * సపిండీకరణాత్పూర్వం ఇతరశ్రాద్ధకర్తవ్యతా. *

సపిండీకరణము జరిగిన పిమ్మట దర్శశ్రాద్ధమును, గయాశ్రాద్ధమును, తీర్థశ్రాద్ధమును, మహాలయశ్రాద్ధమును చేయవలసినది.

—*—

## * పిండదానంవినా శ్రాద్ధకరణ నిషేధః. *

మాతాపితృ మొదలగువారి శ్రాద్ధములందు పిండప్రదానము చేయనివానికి సంతతికిని సంపత్తునకును నాశనము కలుగుచున్నది. కావున ప్రత్యాబ్దిక శ్రాద్ధమును పిండసహితముగా చేయువలెను,

కర్త వ్యాధిచే పీడితుఁడుగా ఉన్నపుడు సహితము. మరియొక బ్రాహ్మణునికి వరుణమిచ్చి యథావిధిగా పిండసహితమగు శ్రాద్ధమును చేయవలెను. లేనిపక్షమున కర్త సంకల్పశ్రాద్ధమైనను చేయవలయును. స్త్రీకర్తృకశ్రాద్ధవిషయమున సంకల్పవిధానముగా శ్రాద్ధము చేయుటవలన దోషములేదు.

—*—

## ——* ఆశౌచమధ్యే ప్రత్యాబ్దికశ్రాద్ధవిధిః. *——

జాతాశౌచ మృతాశౌచ మధ్యలో శ్రాద్ధములు వచ్చిన అపుడు చేయక నిలిపి ౧౧ దినమున ఆశౌచాంతమున చేయవలెను.

—*—

## — { పితృమృతాశౌచమధ్యే మాతుః ప్రాప్త శ్రాద్ధవిధిః. } —

పితాశౌచమధ్యమున తల్లియొక్క ప్రత్యాబ్దికము వచ్చిన యెడల ౧౧ వ దినమున షోడశమైన పిమ్మట శ్రాద్ధమును చేయవలసినది.

—*—

## —* మాత్రాశౌచమధ్యే పితుఃప్రత్యాబ్దిక శ్రాద్ధవిధిః. *—

తల్లియొక్క దశాహమధ్యమున తండ్రియొక్క ప్రత్యాబ్దికము వచ్చినపుడు ౧౧ వ దినమున షోడశమునకు ముందుగా శ్రాద్ధమును చేయవలసినది.

—*—

## ——* శ్రాద్ధనిమంత్రితస్య గాయత్రీజపసంఖ్యా. *——

ఊనమాసికమున నిమంత్రణ చేసిన బ్రాహ్మణులు ౯ వందలు గాయత్రీజపమును, నైకమాసికమైనేని ౭ వందలును, ప్రత్యాబ్దిక శ్రాద్ధమున న్యూనేని ౩ నూరులు గాయత్రియును, మహాలయ శ్రాద్ధమున ౨ నూరులు జపమును, ప్రేతస్థానమున గూర్చున్న బ్రాహ్మణుఁడు ౧౦ వేలు జపమును, పితృస్థానమున నిమంత్రణ జేయు బ్రాహ్మణుఁడు ౯ వేలను, విశ్వేదేవస్థానమందు గూర్చున్నవాఁడు ౬ వేలు

ను, విష్ణుస్థానమున ౪ వేలును గాయత్రీజపమును చేయవలెను.

—*—

## —{ సపిండీకరణాది శ్రాద్ధాదిషు భోక్తౄణాం పూసనిర్ణయః. }—

ఊనమాసికములయందు నిమంత్రణ చేసిన బ్రాహ్మణుడు ౯ రాత్రులవరకును, నెలమాసికమందు అయిన ౭ రాత్రుల వరకును, ప్రత్యాబ్దికమందు ౩ రాత్రులవరకును, మహాలయమునకు ౨ రాత్రులవరకును, సపిండీకరణమున ప్రేతస్థానమున ౬ మాసముల వరకును, పితృస్థానమునందయ్యేనేని ౩ మాసముల పర్యంతమును, విశ్వేదేవ స్థానమునందైన యెడల ౨ మాసములవరకును, విష్ణుస్థానమున గూర్చున్న బ్రాహ్మణుడు ౩ పక్షములువరకును నిమంత్రణ చేయరాదు.

—*—

## ——* తిలతర్పణం. *——

తీర్థశ్రాద్ధములయందును, తిథియందును, గయాశ్రాద్ధమందును, మహాలయ పక్షమునందును, మన్వాదులయందును తిల సహితమైన తర్పణం చేయవలెను.

—*—

## ——* ద్విభార్యకస్య గర్భవపన విధిః. *——

ఒకనికి ఇద్దఱు భార్యలుండి వారిరువురు గర్భవతులుగా నున్నపుడు ఇద్దఱిలో నొకరు ప్రసవించినయెడల వాడు క్షౌరము చేసికొనరాదు. జాత కర్మ నామకరణాదుల చేసికొన వచ్చును.

—*—

## ——* అన్యకర్తృకశ్రాద్ధస్య అన్యకర్తృకత్వ నిషేధః. *——

సపత్నీమాతృకు కుమారుని చేతగాని, తండ్రి చేతగాని కర్మ చేయబడి శ్రాద్ధము పెట్టుచువచ్చి కాలాంతరేణ యాకర్తలు మృతినొందిన అపుడా శ్రాద్ధమును పెట్టవలసినది పనిలేదు. ఈవిషయమున దేశ వృద్ధాచారముల ననుసరించి నడచుకొన వలయును.

—*—

### —* కర్తృనష్టశ్రాద్ధవిధిః. *—

పుత్రుఁడు తల్లికి శ్రాద్ధముచేయుచువచ్చి కాలాంతరేణ మృతి నొందినప్పుడు జీవించియుండు వానితండ్రి భార్యకు శ్రాద్ధమును యథావిధిగా పిండసహితమగు శ్రాద్ధమును చేయవలెను. ఇదే ప్రకారముగా తండ్రి చనిపోయిన తర్వాత పుత్రుఁడును మృతినొందిన భార్య భర్తకు యథావిధిగా శ్రాద్ధమును చేయవలెను. వీరలకు తప్ప ఇతరులకు రెండవ కర్తవ్యము పుట్టదు.

—*—

### —* విశ్వే దేవతా నామాని. *—

ఇష్టి శ్రాద్ధమున విశ్వేదేవతలు కృతు దక్షులు, నాందీ శ్రాద్ధమున సత్యవసువులు, కామ్య శ్రాద్ధమునందు ధూర్విలోచనలు, పార్వణ శ్రాద్ధమున పురూరవార్ద్రవులు, సపిండీ కరణమున కాలకాములు విశ్వే దేవతులు.

—*—

### —* మాతామహ శ్రాద్ధవిధిః. *—

మాతామహ శ్రాద్ధమును పితృ శ్రాద్ధమునువలెనే యథావిధిగా పిండ సహితముగా దౌహిత్రుఁడు చేయవలయును. జీవ పితృదైనపుడు శ్రాద్ధాంగ తర్పణమును చేయరాదు. మాతా మహికిని ఇదే రీతిగా చేయవలెను.

—*—

### —* మాతామహ శ్రాద్ధస్య క్వచిదపవాదః. *—

మాతా మహునికి సపిండీకరణమును, ఏకోద్దిష్ట శ్రాద్ధమును, ప్రత్యాబ్దిక శ్రాద్ధమును వదలిపెట్టి మిగత శ్రాద్ధములయందు ౬ పిండములను పెట్టవలయును.

—*—

### నాందీకర్తృ ష్షాణ్మాసపర్యంతం శ్రాద్ధకర్తవ్యత్వవిధిః.

ఉపనైన మైనవాఁడును, వివాహ మైనవాఁడును, ౬ మాస

ములవరకును దీక్ష యుండవలయును. కుమారుని ఉపనైనమందును, కుమార్తె యొక్క వివాహమందును, నాందీకర్త ౬ మాసముల వరకును తల్లిదండ్రుల ప్రత్యాబ్దిక మందుగాని, వీరల యొక్క ప్రేత కర్మగాని చేయవలసి వచ్చినపుడు శాస్త్రోక్త ప్రకారముగా దూర్వాక్షతలచేతను పూజచేయవలెను. పిండమునను, వికిర పిండము పెరుగువేసి బదరీ ఫలములను కూడా చేర్చి పిండములను చేసి పిండప్రదానము చేయవలెను. అపసవ్యము, తిల తర్పణము, దర్భలు, తిలలు వీటిని వదలిపెట్టి శ్రాద్ధమును చేయవలెను.

—※—

## —* అనేకశ్రాద్ధ సన్నిపాతే. *—

ఒకటే దినమున పితృమాతృ తిధులువచ్చినపుడు మొదట పితృశ్రాద్ధమును, పిమ్మట మాతృ శ్రాద్ధమును, అటు పిమ్మట దర్శ శ్రాద్ధము, తరువాత మహాలయమును చేయవలెను. దర్శయందు సంక్రమణ శ్రాద్ధము వచ్చినపుడు సంక్రమణ శ్రాద్ధము ముందు చేయవలెను. సంక్రమణమును, గ్రహణమును, దర్శయును, ఒక దినమున వచ్చినపుడు మొదట సూర్యగ్రహణ శ్రాద్ధమును, పిమ్మట సంక్రమణ శ్రాద్ధమును, అటు పిమ్మట దర్శ శ్రాద్ధమును చేయవలెను. అమావాస్యయందు మాసికము వచ్చినపుడు ముందుగా మాసికమును పెట్టి పిమ్మట దర్శ శ్రాద్ధమును చేయవలయును. అమావాస్యయందు ప్రత్యాబ్దికము వచ్చినపుడు ముందుగా తిధిపెట్టి పిమ్మట దర్శ శ్రాద్ధమును చేయవలెను. నిత్య నైమిత్తకములు ఒక దినమున వచ్చినపుడు ముందుగా నైమిత్తకమును చేసి పిమ్మట నిత్యమును చేయవలెను.

—*—

## —* ఏకస్యైవ భిన్నసంబంధత్వే. *—

ఒక దినమునందు ౨, ౩, శ్రాద్ధములు తటస్థించినపుడు ప్రత్యేకముగా పాక సంబంధము లేకుండ శ్రాద్ధములను పెట్టి తర్పణమునున్ను ప్రత్యేకముగా చేయవలెను.

—*—

### గ్రహణే ఆశౌచ స్నాతకాభావః.

జాతాశౌచ మృతాశౌచములయందు సూర్యచంద్ర గ్రహణములు వచ్చినపుడు ఆశౌచము గలవాఁడు ముఖ్యముగా స్నానము చేయవలసినది. అట్లు స్నానము చేయని పక్షమున మృత్యువును పొందుచున్నాఁడు. గ్రహణము పట్టినది మొదలు విడచు వరకు ఆశౌచము లేదు. స్నానతర్పణములు చేయవచ్చును.

—*—

### గ్రహణే ప్రత్యాబ్దికశ్రాద్ధవిధిః.

చంద్రుఁడు గ్రస్తోదయ గ్రస్తాస్తమానమైనపుడు రాత్రి ప్రత్యాబ్దిక శ్రాద్ధమును పెట్టవలయును. సూర్యుఁడు మూఁడవ యామమునగాని నాలుగవ యామమునగాని గ్రహణముపట్టి అస్తమానమునకు లోపల విడుపు చూపునపుడు రాత్రి శ్రాద్ధమును పెట్టవలెను. నాలుగవయామమునఅంతమునందు గ్రహణముపట్టి గ్రస్తాస్తమానమైనపుడు ఆదినం ప్రథమ యామమున ప్రత్యాబ్దికమును చేయవలెను. అర్ధోదయమందును, తీర్థశ్రాద్ధముయందును, సంక్రాంతి యందును, చంద్ర సూర్య గ్రహణములయందును, రాత్రి పూట దహనమైనపుడును ఈ కార్యములు రాత్రివేళ కలిగినపుడు అన్నశ్రాద్ధమును పిండ సహితముగాచేయరాదు. ఆమశ్రాద్ధముగాని, హిరణ్య శ్రాద్ధముగాని చేసి తర్పణము చేయవలెను. సూర్యగ్రహణము పట్టినపుడును, చంద్ర గ్రహణము విడుపు చూపునపుడును తర్పణము చేయవలెను.

—*—

### శ్రాద్ధాంగ తర్పణవిధిః.

దర్శయందు ముందుగా తర్పణమును చేసి శ్రాద్ధమును పెట్టవలయును. మహాలయమును పెట్టిన పిమ్మట తర్పణమును చేయవలెను. ప్రత్యాబ్దికమునందు ముందుగాని, శ్రాద్ధమును పెట్టిన పిమ్మట గాని తర్పణముచేయరాదు. మరు దినము సూర్యోదయాత్పూర్వము తర్పణము చేయవలసినది. దర్శయందును, వ్యతీపాతయందును, సంక్రాంతియందును, యుగాదులయందును, మన్వాదులయందును, ఈ

కాలములయందును తర్పణముచేసి పిమ్మట ఈ శ్రాద్ధమును పెట్టవలసి నది. పక్ష శ్రాద్ధమునందును, హిరణ్య శ్రాద్ధమునందును శ్రాద్ధము పెట్టిన పిమ్మట తర్పణము చేయవలసినది. అష్టక శ్రాద్ధమునందును, అను మాసికములయందును, సపిండీకరణమునందును, ప్రేతశ్రాద్ధము నందును, సంవత్సర విమోకమునందును, వృద్ధి శ్రాద్ధమునందును, ఈ శ్రాద్ధములయందు శ్రాద్ధాంగతర్పణము అప్పుడే చేయవలసినది. వీటికి పరేహాని తర్పణము చేయకూడదు. మాతా పితృవులకు తప్ప ఇతరులకు పరేహాని తర్పణము లేదు.

—*—

## జీవపితృకస్య తర్పణ నిషేధః.

పుత్రుడు తల్లికి శ్రాద్ధముచేయు నపుడు తండ్రి జీవించియుం డెనేని శ్రాద్ధాంగతర్పణముచేయ పనిలేదు. అతివాసము ఉండనక్క రలేదు.

—*—

## పరేహాని శ్రాద్ధాంగతర్పణవిధిః.

శ్రాద్ధపరదినమునందు ఉషఃకాలమునందు లేచి పరిశుద్ధమగు ఉదకమున స్నానముచేసి శ్రాద్ధదినమునందు మిగిలిన దర్భలు, నువ్వు లు తీసికొని మాతా పితృల తిథులయందున పరేహాని తర్పణము చేయవలెను. మిగత కారుణ్య శ్రాద్ధములకు పరేహాని తర్పణము లేదు. శ్రాద్ధాంగతర్పణము అప్పుడే చేయవలెను. పరేహాని తర్పణమైన పిమ్మట స్నానముచేసి సంధ్యావందనము చేయవలయును. శ్రాద్ధాం గతర్పణము పరదినమున చేయక పోయిన వారిని పితృదేవతలు శపిం చుచున్నారు.

మృతాశౌచమునందును, శ్రాద్ధ దినమునందును, ఉపవాస మందును, రాత్రి పగలు కర్త తాంబూలమును వేసికొన కూడదు. పరేహాని తర్పణము చేయు వరకు కర్త ఈ నియమమును నవలంబింప వలయును.

—*—

జాతాశౌచ మృతాశౌచములు వచ్చినప్పటికిని పరేహాని తర్పణము నిలుపక చేయవలెను.

—*—

## ——* ప్రత్యాబ్దిక కాలనిర్ణయః. *——

అహః ప్రమాణ ఘడియలను ౫ భాగములుగచేసి వాటిలో మొదటిభాగము ప్రాతఃకాలము, ౨ వ భాగము సంగవ కాలము, ౩ వ భాగము మధ్యాహ్నకాలము, ౪ వ భాగము అపరాహ్ణకాలము, ౫ వ భాగము సాయాహ్నకాలము. నాలుగవదియగు నపరాహ్ణకాలముననే తిథి ఘడియలు వ్యాపించియున్నదో ఆతిథి శ్రాద్ధాది సత్కార్యములకు ముఖ్యము. రెండుదినములలో అపరాహ్ణవ్యాప్తి సమానముగా నుండిన పూర్వదినమే ముఖ్యము. ఒకతిధికి రెండువారములలో వ్యాప్తి కలిగియుండిన నేదినమున అధికముగా నుండునో ఆతిధినే అనుసరించవలయును. రెండుదినములలోను నపరాహ్ణవ్యాప్తి లేకయుండిన పూర్వదినమున సాయాహ్న వ్యాప్తి చక్కగా నుండిన నాడే ముఖ్యము. రెండుఅపరాహ్ణములలోను సమముగానుండిన వృద్ధి పక్షమున ప్రథమదినమునను, క్షయపక్షమున ద్వితీయదినమునను కర్తవ్యము. దీనినెరిగి శిష్టులెల్లరును ఆచరించుచున్నారు.

—*—

## —{ సపిండీకరణవిషయే కర్తృభార్య రజస్వలావిధిః. }—

సంవత్సరాంతమున కర్తృభార్య రజస్వలైనప్పటికిని భార్యస్థానమున ప్రతినిధి కుశరూపముగా ఏర్పరుచుకొని అగ్నిసంధానము చేసికొని సపిండీకరణము ముఖ్యముగా చేయవలసినది. అది తప్పిన సపిండీకరణమునకు యుక్తకాలములేదు. ౧౨ వ దినమున సపిండీకరణము చేయునట్టి సంకల్పముచేసి ౧౧ వ దినమున షోడశమైనతిమ్మట కర్తయొక్కభార్య రజస్వలై సపిండీకరణము నిలిచినపుడు పునః సపిండీకరణము చేయునపుడు పునః షోడశము చేయవలయునని సుధీ

విలోచనమను గ్రంథమున చెప్పబడియున్నదిగాని ఈవిషయమును దేశాచారము కర్తవ్యము.

—*—

## —* ప్రత్యాబ్దికే కర్తృభార్యా రజస్వలావిధిః. *—

ప్రత్యాబ్దికము, మాసికము, సంవత్సరవిమోకము, మహాలయము, తీర్థశ్రాద్ధము, దర్శశ్రాద్ధము, మొదలైన శ్రాద్ధములను భార్య రజస్వలైనప్పటికిని ఆతిథులలో తప్పక చేయవలెను. మృతతిథియందు ప్రత్యాబ్దికమును పెట్టనియెడల కోటిజన్మముల వరకును చండాలత్వమును వహించి యుండును.

—*—

## —* గర్భిణీ సంస్కారవిధిః. *—

గర్భిణీస్త్రీ ౬ మాసములైన తర్వాత మృతినొందిన సర్వప్రాయశ్చిత్తముచేసి కర్మ ఆరంభించి స్మశానమునకు తీసికొనిపోయి చితియొక్క పశ్చిమభాగమునందునిచి కర్త స్వగృహ్యోక్త ప్రకారేణ ఆయతనప్రోక్షణాది దర్వీం సమ్మార్జనాంతం తంత్రం కృత్వా మృతినొందిన గర్భిణీస్త్రీ నాభిక్రిందను ఎడమపార్శ్వమున ౪ అంగుళముల ప్రమాణముగల ఉదరమును "హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే" అను మంత్రముచేత భర్తగాని కర్మచేయు మరెవ్వరుగాని కోసి శిశువును బయిటతీసి స్నానము చేయించి భూమియందుంచవలయును. ఆశిశువు బ్రతికియున్నయెడల "జీవత్వాయం మమపుత్రః" అని ఆశిశువు నభిమంత్రించి "క్షేత్రిన్మైత్వా" అని పంచమంత్రములచేత స్నానముచేసి భూమియందు బంగారునుంచి ఆబంగారునందు పరుండపెట్టి "భూర్భువస్సువః" అను మంత్రముచే నభిమంత్రించి గృహమునకుఁ దీసికొనిపోయి "యస్తే స్తన శశయో యోమయోభూః" అను మంత్రముచేత ఆశిశువుకు మరియొకస్త్రీచే పాలు నిప్పించుచు సంరక్షణ చేయవలసినది. పిమ్మట శవమును సమీపించి స్రువమును న్ను, ఆజ్యస్థాలినిన్ని తీసికొని "శతాయుధాయేత్యాది" మంత్రములచే స్రువముచే ఆజ్యమును తీసికొని గర్భము ఛేదించిన స్థలమున

హోమము చేయవలెను. పిమ్మట గర్భము ఛేదించిన స్థలమును యథాప్రకారము రజ్జుచేత కుట్టి నేతిచే తడిపి వారుణ మంత్రములచే ప్రేతకు స్నానము చేయించి వస్త్రమునుగట్టి ఉదరచ్ఛేదన ప్రాయశ్చిత్తముచేసి గోదాన భూతిలదానములచేసి అటు పిమ్మట పుత్రులు రాజగవీచితి సమీపం ప్రయోగం కర్మయథావిధిగా చేయవలసినది. ఈశిశువు మృతినొందిన ఖననముచేయవలసినది. పై జెప్పిన ప్రయోగముజేయ బనిలేదు.

—*—

——* రజస్వలాసూతికయో స్సంస్కారవిధిః. *——

స్నానమునకు ముందుగా రజస్వలైన స్త్రీయైనను, ప్రసూతి అయినస్త్రీగాని మృతినొందినయెడల ఆస్త్రీని తాకక ముందుగా ౧౦౮ కుండల నీళ్ళచే స్నానము చేయించి వేరే వస్త్రమునుకట్టి ఒక కలశములో ఉదకమును పూర్తిగాపోసిపెట్టి ఆకలశమునందు పంచామృతము, పంచగవ్యములు, పంచ మృత్తికలు, పంచ రత్నములు, ఉంచి కర్త సంకల్పముచేసి వరుణదేవతను ఆవాహనముచేసి పూజ చేసి నలుగురు బ్రాహ్మణులకు వరుణము ఇచ్చి ఆపోహిష్ఠేతి మూడు మంత్రములచేతను, వారుణ మంత్రములచేతను, హిరణ్యా వరుణాశ్శుచయః, పవమానస్సువర్జనః, అనువాకముచేతను, యజుః పవిత్ర మంత్రముచేతను, హగ్ంసశ్శుచిషత్ అను ఋక్కుచేతను అగ్నిర్మూర్థాదివఃకకుత్ మంత్రముచేతను, తరత్సమందిరియై రేతోన్విం్రదాది మంత్రములచేతను, ఇతరములైన సూక్తములచే నభిమంత్రించి మృతి నొందినస్త్రీకి కలశోదకముచే నఘమర్షణసూక్తము పఠించుచు నలుగురు ఋత్విక్కులు స్నానముచేయించి పిమ్మట కృచ్ఛ్రత్రయములు, గోదానముచేసి, ఋత్విక్కులకు దక్షిణయిచ్చి పిమ్మట సర్వప్రాయశ్చిత్తముచేసి పైతృమేధిక కర్మ యథావిధిగా చేయవలసినది. సుమంగలి మృతినొందిన యెడల పసుపు కలపి ౧౦౮ కుండల నీళ్ళు పోయవలసినది. విధవ మృతినొందిన యెడల తులసి మృత్తిక ఉదకములో వేసి ౧౦౮ కుండలు పోయవలసినది.

## —* పాలాశవిధిః. *—

పాలాశవిధిగా కర్మచేయుటకు మునువు కర్త క్షౌరము చేసికొనవలయును. దేశాంతరమునందు మృతినొందినవానికి శరీర సంబంధమైన అస్థులు లేనపుడు మోదుగ సమిధలచేతను ప్రేత శరీరముగా ఏర్పరచవలసినది. శిరస్సుయందు ౪౦ సమిధలును, కంఠమునందు ౨౦ యును, రొమ్మునందు ౩౦ యుని, కడుపునందు ౨౦ యును, భుజములయందు ౧౦౦ ను, అంగుళములందు ౧౦ యును, బీజమునందు ౧౦ యును, తొడలయందు ౧౦౦ ను, పిక్కలయందు ౩౦ యును, పాద అంగుళములయందు ౧౦ యును నుంచి కంబళదారముచే ఈసమిధల మొత్తమునుకట్టి శరీరాకృతిగా చేయవలయును. పిమ్మట ఆరూపమునకు స్నానము చేయించి అలంకరించి వస్త్రము గట్టి, కృష్ణాజినమునందునిచి ఆవాహనచేసి ప్రాణ ప్రతిష్ఠ చేసి మూడు ప్రాజాపత్య కృత్యములచేసి.

శ్లో॥ యత్రయత్ర గతఃప్రేతః సంస్కారరహిత స్తధా ।

పలాశ కర్మణాంతృప్తిం ప్రాప్యగచ్ఛ యధాసుఖం ॥

ఈ ప్రకారముగా ప్రార్ధనచేసి పిమ్మట సర్వ ప్రాయశ్చిత్తముచేసి కర్ణమంత్రంపఠేయువాగ్ం సమిత్యాది సర్వాంకృత్వా ప్రేతాగ్నౌ । అగ్నేప్రేహి ప్రథమో దేవయతాం ॥ అను మంత్రము చేత హోమముచేసి ప్రేత రూపమగు పలాశ శాఖ ప్రతిమను దహించవలయును. అస్థి సంచయనము చేయనక్కర లేదు. ఆభస్మమును ఉదకములో వేయవలసినది. నగ్నశ్రాద్ధ శిలా ప్రతిష్ఠ మొదలగు కార్యములను యధావిధిగా చేయవలెను. మోదుగ సమిధలు దొరకనపుడు దర్భ సంస్కారము చేయవలెను.

మాతా పితృవులకు పాలాశ విధిగా కర్మ నారంభించిన దినము మొదలుకొని నిత్యకర్మ౧౦ దినములుచేసి ౧౧వ దినము దశాహస్సు జరిగించి అందు పిమ్మట షోడశ సపిండీకరణము యధావిధిగా చేయవలెను. జ్యేష్ఠ భ్రాత మొదలగు వారలకు పాలాశ విధానముగా కర్మ

చేయునపుడు త్రిరాత్రాశౌచ విధిగా చేయవలెను.

—*—

### * ఉదక క్రియా విధిః.

స్మశానాగ్ని యున్నపుడు అస్థి యున్నయెడల యథా విధిగా కర్మ దహనము మొదలుకొని చేయవలసినది. అస్థులు లేనపుడును, శరీరము లేనపుడును, అగ్ని లేనపుడును, దేశాంతరమున మృతినొంది తల్లి దండ్రులకు ఉదక క్రియా విధిగా కర్మ చేయవలెను. ఇది గాక అపత్నీకుఁడు, అవుపాసనము వదలినవాఁడు, పతితుఁడు, పాషండులు, ఆశ్రయించిన వాఁడు, భర్తను చంపిన స్త్రీ అనాచారుఁడు, నీటియందు పడి మృతి నొందిన వాఁడు, వృక్షములనుండి పడి మృతి నొందిన వాఁడు, స్ఫోటకముచే చని పోయిన వాఁడు, ఉరి పెట్టుకొని హత్య చేసుకొనిన వాఁడు, కుష్ఠు వ్యాధిపీడితుఁ డగువాఁడు, పశు సర్పాదులచే మరణించిన వాఁడు, ఈ పైఁ చెప్పిన దుర్మరణముల నొందిన వారలకు పాలాశ విధిగా చేయవలెను. కాని వీరికి ఉదక క్రియ విధానమున చేయమని హారీతుఁడను ఋషి చెప్పియున్నాఁడు.

—*—

### * ఉదకక్రియా ప్రకారః. *

కర్త బ్రాహ్మణ సహితుఁడై పుణ్యక్షేత్రమగు నదికి దొరకిన వరకు ద్రవ్యమును, తిలలు వీటిని తీసికొని వెళ్ళి బ్రాహ్మణ యనుజ్ఞ పడసి సచేల స్నానముచేసి పాదములను చేతులను కడిగికొని బ్రహ్మ దండము, తిలలు, దర్భలు, హిరణ్యము వీటిని కుడిచేతిలో నుంచుకొని యజ్ఞోపవీతమును సవ్యముగా నుంచుకొని మూడు ప్రదక్షిణముల చేసి బ్రాహ్మణులకు నమస్కారముచేసి విజ్ఞాపనము చేసికొని నదీతీరమున బ్రాహ్మణుల ఆజ్ఞచే తిలలు మొదలైన ద్రవ్యములనుంచి గాయత్రీచే ప్రోక్షించి నల్లనైనను, ఎర్రనైనను పాషాణమును ఉంచి ప్రాణ ప్రతిష్ఠచేసి కేశవాది నామములచేత స్నానము చేయించి గోదానము మొదలైన దానములనుచేసి కర్ణ మంత్రమునుచెప్పి రోద

నముచేసి స్నానముచేసి కేశవపనము చేసికొని స్నానముచేసి దక్షిణపు దిక్కున గూర్చిపోయి అచ్ఛోట పాషాణమును నుంచి పాషాణమున కభిముఖముగా కూర్చుని క్రియలు చేయవలసినది. సర్వ ప్రాయశ్చిత్తము, షణ్ణిమిత్త ప్రాయశ్చిత్తమును, దశ దానములను చేసి అటు పిమ్మట మోకాటి లోతుగల నీళ్ళలోనుండి సంవేశము మొదలుకొని దహనాంతము పైతృమేధిక కర్మ మంత్రములను జపించి సంచయన మంత్రమును జపించి పిమ్మట శిలాస్థాపన చేసీ, యాశిలయందున శిలాస్నానము, మృదాస్నానము, వాసోదకము, తిలోదకమును విడిచి పిండ దానము చేసి నగ్న శ్రాద్ధ నవ శ్రాద్ధములనుచేసి సపిండీ కరణాంతము కర్మ చేయవలసినది. పుత్రులు మొదలగువారు పైఁజెప్పిన విధముగా చేయవలెను.

—*—

## ※ అనుగమన విధిః. ※

ఏస్త్రీ మృతినొందిన భర్తతో కూడా అగ్నియందు సహగమనము చేయుచున్నదో యాస్త్రీ పితృ మాతృ కులములకును, భర్తకులమునకును పరిశుద్ధము చేయుచున్నది. పరలోకమున భర్తతో కూడా స్వర్గాది భోగముల ననుభవించు చున్నది.

—*—

## *బ్రాహ్మణవ్యతిరిక్తానాం పృథక్చిత్యారోహణవిధిః.*

బ్రాహ్మణేతర జాతి స్త్రీలు భర్తతో గూడా యనుగమనము చేయు పక్షమున వేరేచితిని యేర్పఱిచి యాచితియం దునిచి దహనము చేయవలసినది.

—*—

## * అనుగమన నిషేధకాలాః.

దుర్మరణముగలిగిన భర్తతోను, తాను రజస్వలగానున్నను, గర్భవతిగానున్నను, భర్తతో సహగమనము చేయకూడదు.

—*—

## —— అనుగమన ప్రకారః. ——

సహగమనము చేయు స్త్రీ మంగళ స్నానముచేసి, ఆభరణముల నలంకరించుకొని, కాటుక నిడికొని, గంధము నలదికొని, పుష్పములచే నలంకరించుకొని, పసుపు చీరను ధరించుకొని, నూతన మంగళ సూత్రమును ధరించు కొని, అనేకములగు మంగళ వాద్యములు మ్రోయుచుండ ఉత్క్రాంతి గోదానముచేసి తిల పాత్రదాన మొసగి, తన శరీరమందున్న ఆభరణములను దానముచేసి చితియందు భర్త ప్రకటన దేశకాలమును స్మరించి పరుండి ప్రాణముల విడువవలయును.

—*—

## అనుగమనే సంస్కారాది సపిండీకరణాంత కర్మణాం విధిః.

ఏస్త్రీ భర్తతో సహా యనుగమనము చేయుచున్నదో ఆస్త్రీకిని, భర్తకును, అస్థి సంచయనాంతము వరకు సంస్కారము చేయవలసినది. ఏక కాలమున మృతినొందిన యనేక మందికిగాని, యిద్దఱికిగాని తంత్రముచే దహనము చేయవలయును. శ్రాద్ధము ప్రత్యేకముగా చేయవలసినది. పుత్రుఁడు మాతా పితృవులను నేకచితియందునిచి దహనముచేసి తిలోదకములను, అగ్నిని, చరువును, హోమమును, ఉపస్థానమును, అస్థిసంచయన హోమమును, దశాహతంత్రమును నేకకాలమున నొకటిగా జరుగింపవలసినది. పిండ శ్రాద్ధములను, నవ శ్రాద్ధములను, వృషోత్సర్జనమును, నేకోద్దిష్ట హోమమును షోడశము, సపిండీకరణమును, మాసికములను, ప్రత్యేకముగా చేయవలయును. సంచయన దినమున సహగమనమైన స్త్రీకి కర్మ యథావిధిగా ప్రత్యేకముగా చేయవలెను.

—*—

## —— దుర్మరణ ప్రాయశ్చిత్తవిధిః ——

అడవి పందులు, సర్పములు, పెద్దపులులు, విషము, అగ్ని, ఉదకము, పిడుగు, రాజదండనము, జారత్వము, చండాలాదులు,

శస్త్రములు, పర్వతమునుండి పడినను, వృక్షపాతమును, పతితులు, పాషండులు, హత్య, యేనుగులు, గుర్రములు, శునకములు, క్రిమికీటాదులు, శకటపతనము, స్ఫోటకము, అన్నమును భుజించుచు, క్షయరోగము, అతిసారము, శాకిన్యాది గ్రహములు, మెరుపులు, అంతరిక్షము, సురాపానము, బ్రాహ్మణుడు, అన్నము లేక, ఈపైఁ జెప్పిన విధముల మృతినొందుట దుర్మరణములు. దుర్మరణము కలిగినపుడు అమంత్రవత్తుగా సద్యఃకాలమున దహనము చేయవలెను. వీరలకు సంవత్సరాంతమున శాస్త్రోక్తప్రకారముగా ౩౦ ప్రాజాపత్య కృచ్ఛ్ర ప్రాయశ్చిత్తముచేసి, నారాయణ బలిచేసి, కర్మ మంత్ర పూర్వకముగా దహనము మొదలుకొని ఆశౌచము ఉండి కర్మ యథావిధిగా చేయవలయును.

—*—

—* సంవత్సరమధ్యే సంస్కారః. *—

౬ మాసములకుపైన ౭ వ మాసమున కర్మచేయునపుడు ౬౦ ప్రాజాపత్య కృచ్ఛ్రములుచేసి నారాయణ బలిచేసి కర్మ యథావిధిగా చేయవలెను. ౩ మాసములకు పైన కర్మ చేయునపుడు ౯౦ ప్రాజాపత్య కచ్ఛ్రములచేసి నారాయణబలిచేసి కర్మ చేయవలెను. ౩ పక్షములకుపైన కర్మచేయు నపుడు ౧౨౦ ప్రాజాపత్య కృచ్ఛ్రములను చేయవలెను. సద్యఃకాలమున శరీరమున్నపుడు ౧౫౦ ప్రాజాపత్యకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తముచేసి నప్పటికిని శాస్త్రోక్తప్రకారముగా ప్రత్యక్ష శరీరమును దహనము చేయకూడదు. లౌకికాగ్నిచే దహనముచేసి నారాయణబలిచేసి అస్థులను తీసికొని ఆవుపాలచేత ప్రక్షాళనముచేసి స్వసూత్రోక్త ప్రకారముగ స్వాగ్నిచే సంస్కారమును చేయవలెను. అస్థులులేని పక్షమున మోదుగ సమిధలచేతను రూపము నేర్పరిచి సంస్కారము చేయవలయును. ప్రాయశ్చిత్తాత్పూర్వం ఆశౌచములేదు. సంధ్యాది క్రియలను చేసికొనవలయును. ఇది ధనిక విషయము.

—*—

―――* అశక్తవిషయము. *―――

దుర్మరణమువలన మృతినొందిన వానికి కర్త సద్యస్సాలమున స్నానముచేసి బ్రాహ్మణ యనుజ్ఞవడసి ౧౫ ప్రాజాపత్య కృచ్ఛ్రాత్మకమైన ప్రాయశ్చిత్తమును, నారాయణబలి చేసి మృతినొందిన వాని శరీరమును పంచగవ్యముచేతను, వరుణ మంత్రముల చెప్పుచు, పవమాన సూక్తము పఠించుచు యథావిధిగా వందనముచేసి అది మొదలు ఆశౌచముండి యథావిధిగా కర్మ చేయవలసినది.

―*―

―――* అకృతచూడ విషయము. *―――

చౌలముగాని వటువుకు, చండాలునిచేతను, అగ్నిచేతను, మెరుపుచేతను, బ్రాహ్మణునిచేతను, శునకముచేతను మృతినొందిన వానికి, వృక్షముననుండి పడినవానికి, యుదకముచేతను, భోజనము చేయునపుడును, వీట్లచే మృతినొందిన వానికి తప్త కృచ్ఛ్రముచేసి క్రియచేయవలసినది.

―*―

―――* అనుపనీత విషయము. *―――

కొండమీదనుండి పడిన వానికి, భోజనము లేని వానికి, ఉదకమునందు మరణించిన వానికి, వీరల పాపనివృత్తికొఱకు ౬ ప్రాజాపత్య కృచ్ఛ్రములను, నారాయణ బలిని చేయవలెను.

―*―

―――* దుర్మరణే కృచ్ఛ్రప్రతినిధిః. *―――

ప్రాజాపత్య కృచ్ఛ్రమునందు ప్రత్యామ్నాయము ౧ గోదానమును, సాంతపనమునందు ౨ గోదానములును, పరాకకృచ్ఛ్రమున 3 గోదానములను, తప్త కృచ్ఛ్రమున సహితము 3 గోదానములను, చాంద్రాయణమున ౮ గోదానములను, చేయవలయును. ఇది ధనిక విషయము.

అశక్తి విషయ మెట్లనిన―శక్తిలేనివాడు ప్రాజాపత్య కృచ్ఛ్రమునందు ౧ గోదానము చేయవలయును. గోదానముచేయుటకు అశ

క్తుండగువాండు ౧ వరహా యివ్వవలయును. ఇది ఇచ్చుటకు నశక్తు డైన వాండు, అర వరహా ఇవ్వవలయును. దీనికిని శక్తిలేనివాండు కాలువరహానైన ఇవ్వవలయును. ఈ ప్రకారముగా ప్రాజాపత్య కృచ్ఛ్రి విషయము గ్రంథమున చెప్పబడియున్నది. ఈవిషయములో శక్తిచేత గాని, అశక్తిచేత గాని లోకాచార ప్రకారము చేయు వలయును.

—*—

## * స్ఫోటకమృతవిధిః. *

స్ఫోటకముచే మృతినొందినవార్లకు ౩౭౹ ఘడియలు ఖననము చేసియుంచి యటు పిమ్మట శవమును బయటతీసి దుర్మరణ ప్రాయశ్చిత్తముచేసి యథావిధిగా కర్మ చేయవలెను.

—*—

## * మాతామహ శ్రాద్ధవిధిః. *

శ్లో॥ మాతామహస్య ర్మాతులాదేః దౌహిత్ర స్వీయవహ్నినా ।
ఆబ్దికం మాసికాదీంశ్చ తత్తత్సూత్రేణ కారయేత్ ॥

అర్థము॥ మాతామహుండు, మాతామహి, మేనమామ మొదలగు వారికి దౌహిత్రుండు కర్త అయినపుడు మృతి నొందిన వారి శాఖాగ్నిచేతనే యగ్ని సంస్కారము మొదలైన కర్మ యథావిధిగా ఆబ్దికములను, మాసికములను వారివారి సూత్రములచే చేయవలెను.

—*—

## * అత్యబ్ద సాపిండ్య విధిః. *

మృతినొందిన వానికి సంవత్సరమునకు పైనెప్పుడు కర్మ చేసినను త్రిరాత్ర విధిగా కర్మచేసి, సపిండీకరణముచేసి ఆదినమే శ్రాద్ధము పెట్టి మాసికాదులు చేయ బనిలేదు మృత తిథియందు ప్రతి సంవత్సరమును యథావిధిగా తిథీ పెట్టుచు రావలయును.

—*—

## * స్నాతకబ్రహ్మచారి అగ్నివిధిః. *

కృతసమావర్తనస్య అకృతవివాహస్య బ్రహ్మచారిత్వాభావాత్

గృహస్థత్వాభావాచ్చకపాలాగ్న్యుపాసనాగ్న్యోః ప్రసక్తిఅభావాత్ అన్యాను త్తపనేన ఇతిబోధాయనవచనాత్ ఉత్తపనేనేతరాన్ ఇత్యాపస్తంబవచనాచ్చ ఉత్తపనాగ్నినైవదహేత్ ॥

అర్థము॥ సమావర్తన వ్రతము చేసికొని వివాహము కాక మునుపు మృతించిన వాడు బ్రహ్మచారియును కాడు. గృహస్థుడును కాడు. కావున వానిని కపాలాగ్ని చేతగాని ఔపాసనాగ్ని చేతగాని దహింపరాదు. బోధాయన వచనాను సారముగా వానిని ఉత్తపనాగ్నిచే దహింపవలయును. అపస్తంబుడు ఈలాగే చెప్పియున్నాడు.

—*—

## —*వ్యభిచారీత్యాగః.*—

శ్లో॥ జారేణ జనయేద్గర్భం మృతేవ్యక్తే గతేపతౌ ।
తాంత్యజేత పరేరాష్ట్రే పతితాం పాపకారిణీం ॥

అర్థము॥ పతి మృతినొందిన పిమ్మట గాని, పతి ఏకారణము చేత నైనను దేశాంతర గతుడైయుండు స్థలము తెలియక యుండు నప్పుడుగాని, ఏస్త్రీ జారునిచే గర్భము వహించునో అట్టి పాపాత్మురాలిని తత్క్షణమే దేశమునుండి వెడల గొట్టవలయును.

—*—

## —*సుమంగలీ విధవావిషయము.*—

శ్లో॥ దహనాత్సంచయనాత్ప్రాక్తు దంపత్యోర్మరణంయది ।
నవైధుర్యం నవైధవ్యం ఇత్యాహ భగవాన్యమః ॥

అర్థము॥ దహనానంతరం సంచయనాత్పూర్వం దంపతులలో నెవరు మృతి నొందినను, పురుషునకు విధురత్వ దోషమును, స్త్రీకి వైధవ్య దోషమును లేదని యమ స్మృతియందున జెప్పబడియున్నది.

—*—

## —{ రజస్వల స్త్రీకర్తృక స్నానదిన విమోకశ్రాద్ధ విషయః. }—

స్నానదినమున సంవత్సర విమోకము వచ్చినట్టులైన "పునః

స్నానేన శుధ్యతి ” అను వచనాను సారముగా సంవత్సర విమోక శ్రాద్ధము చేయవచ్చును.

—*—

## —* మంత్రోచ్చారణవిధిః. *—

శ్రాద్ధమునందు విశ్వేదేవస్థాన నిమంత్రణ బ్రాహ్మణుఁడును, విష్ణుస్థాన నియమిత బ్రాహ్మణుఁడును మంత్రము చెప్పవచ్చుననియు, పితృస్థాన నియమిత బ్రాహ్మణుఁడు సేయరాదనియు వేదవిత్తుల అభిమతము.

—*—

## —* సకృదాచ్ఛిన్న ప్రమాణము. *—

సకృదాచ్ఛిన్న దర్భలు ౭౮ అంగుళముల పొడువుగల పిడికెడు దర్భ యుండవలయునని బ్రహ్మచేఁ జెప్పబడినది.

—*—

## —* విభక్తవిషయః. *—

విభక్తులై అపుత్రులైన సహోదరులలో నెవరికైన మరణము సంభవించిన యెడల భార్యచే కర్మ భర్తకును, భర్తచే భార్యకును కర్మ చేయబడవలయును గాని ఇతరులచేఁ జేయబడగూడదు.

—*—

## —* ఏకదినేక్షౌర కర్మ వర్జము. *—

అన్న దమ్ములు, తండ్రి కుమారులు ఒక దినముననే నిమంత్రణ యుండరాదు, క్షౌరము చేసుకొనరాదు.

—*—

## —* దూరదేశగత బహుకాలానుగత విషయము. *—

గ్రంథాంతరమున దూరదేశమునకుఁ బోయిన వాఁడు బహుకాలము రాకపోయినను, వానిని గురించి యేమియుఁ దెలియకపోయినను, అతఁడు పూర్వ వయస్కుఁడైన ౨౦ సంవత్సరములును, మధ్యవయస్కుఁడైన ౧౫ సంవత్సరములును, అపర వయస్కుఁడైన ౧౨ సంవత్సరములును గడిచిన తరువాత వానికి పైతృమేధిక కర్మను

చేయవలయును. పిమ్మట అతఁడు వచ్చిన నెయ్యి పాత్రయం దాతనిని కూర్చుండఁబెట్టి, సర్వౌషధ రసములచే నతనికి అభిషేకము గావించి, జాతకర్మాది సంస్కారముఁ జేసి పూర్వపత్నితోనే వివాహము సేయవలయును.

—*—

### —* ఉత్క్రమసాపిండ్యే విశేషః. *—

కాలాదర్శే॥ పితుర్మృతస్య సాపిండ్యంమత్పృయో రూర్ధ్వయోః ద్వయోః । ఏకస్మిన్వాద్వయోర్వాపి జీవతోఽస్సుత ఆచరేత్॥ ఇతి ఏకస్మిన్ద్వయోర్వా ఇత్యభిధానాత్ పితామహాదిషు త్రిషు జీవత్సు నసాపిండ్యం॥

అర్థము॥ తండ్రి గతించి పుత్రుఁడు తండ్రికి ప్రేత కార్యములను చేయునప్పుడు, గతించినతండ్రికి ప్రపితృపితామహ ప్రపితామహులుముగ్గురును జీవవంతులై యుండునపుడు ఆతండ్రికి సపిండీ కరణము చేయరాదు వీరిముగ్గురిలో ఎవరైనను మృతినొంది వానికి సపిండీకరణమునుచేసి పిమ్మట తండ్రికి ఉత్క్రమసాపిండ్యమును చేయవలెను. సపిండీకరణము చేయకపోయినను, తండ్రికి ఏకోద్దిష్టశ్రాద్ధమును చేసినపిమ్మట, కర్త తాను చేయవలసిన, నిత్యకృత్యములును, శ్రాద్ధాదికర్మలును, శుభకార్యములును చేసికొనవచ్చును.

—*—

### —* సపిండీకరణకాలః. *—

శ్లో॥ అనన్త్వాత్కులధర్మాణాం పుంసాంచైవాయుషఃక్షయాత్ ।
అస్థిరత్వాచ్ఛరీరస్య ద్వాదశాహః ప్రశస్యతే ॥

అర్థము॥ కులధర్మంబు లనేకము లగుట వలనను, దినదినమునకును ఆయుక్షీణము గలుగుటచేతను, మానవశరీరము అస్థిరముగాన, సపిండీకరణము ౧౨ వ దినముననే చేయవలయునని మహర్షులచేఁ జెప్పబడియున్నది.

—*—

—* దేశాంతర జ్ఞాతీనాం తిలోదకవిధిః. *—

శ్లో॥ సపిండీకరణాత్పూర్వం ప్రమీత శ్రవణంయది ।
జ్ఞాతీనాంవపనంచైవ దర్భస్తంబే తిలోదకమ్ ॥

అర్థము॥ దశాహానంతరము సపిండీకరణాత్పూర్వం జ్ఞాతిమరణము వినిన క్షౌరముచేసికొని దర్భకూర్చయందున సంఖ్య ప్రకారము తిలోదకమును విడువవలయును.

—*—

—* నామ్నోవేదనే నామగ్రహణము. *—

శ్లో॥ పృథివీషత్పితావాచ్యః తత్పితాచాంతరిక్షసత్ ।
అభిదానే తిరోదానే దివిషత్ప్రపితామహః ॥

అర్థము॥ పితృ పితామహ ప్రపితామహులలో నెవరిపేరైనను దెలియనియెడల నీదిగువరీతిగాఁ జెప్పవలెను. తండ్రికి పృథివీషత్ శర్మయనియు, తాతకు అంతరిక్షసత్ శర్మయనియు, ప్రపితామహునికి దివిషత్ శర్మయనియుఁ జెప్పవలయును.

స్త్రీవిషయమున—పృథివీషంనామ్నీం, అంతరిక్షత్ నామ్నీం, దివిషత్ నామ్నీం, అని క్రమముగాఁ జెప్పదగును.

గోత్రము తెలియని యెడల కాశ్యపగోత్రమును జెప్పవలయునని గ్రంథాంతరమున జెప్పబడియున్నది.

—*—

—* ఆశౌచే సంధ్యావందనవిధిః. *—

శ్లో॥ స్వాధ్యాయజపహోమాది నాశౌచే వర్జయేత్సదా ।
సంధ్యాంతుమనసాకుర్యాత్ అర్ఘ్యమాత్రంసమంత్రకం ॥

—*—

—* శ్రాద్ధే విషనాడికా దోషాభావః. *—

శ్లో॥ స్నానేదానే జపేహోమే వైశ్వదేవే సురార్చనే ।
ప్రాయశ్చిత్తేతథాశ్రాద్ధే ప్రశస్తా విషనాడికాః ॥

శ్లో॥ ఆసనేశయనేభోజ్యే జలమూత్రోత్ప్రజేతథా ।
ఉగ్రకర్మణ్యస్త్రవిధే ప్రశస్తా విషనాడికాః ॥

## —{ వివాహమధ్యే వరస్యమాతాపిత్రోరేక మృతిర్విధిః. }—

వాక్యం ॥ యదివివాహమధ్యే వరస్య మాతా పిత్రోరేకస్య మృతిర్భవేత్ తర్హి అసావేవజ్యేష్ఠశ్చే త్ప్రధానహోమాది శేషహోమాంతం కర్మతదానీమేవకృత్వా కంకణం విసృజ్యస్వయం గత్వాత త్కర్మకుర్యాత్ ॥

వివాహమందు వరుని తల్లిదండ్రులలో నెవరైనను చనిపోయినవరుండు జ్యేష్ఠుండైన ప్రధానహోమము మొదలు శేషహోమమువరకు అప్పుడే జరిగించి కంకణవిసర్జనచేసి పిమ్మట పితృకర్మను చేయవలసినది.

మరియు, చౌలమందును, ఉపనయనమందును, వివాహమందును, వరుని తల్లిదండ్రుల మృతి సంభవించినయెడల మిగిలిన కార్యములను పూర్తిచేసి పిమ్మట పైతృమేధిక కార్యములను చేయవలయును.

వివాహమున ఔపాసనమునకుం బూర్వము వధూవరులలో నెవరైనను మృతినొందిన, మరియొకరు స్థాలీపాకమును ఒనరించి మరునటి దినమున ప్రేతకార్యమును జేయవలెను.

—❋—

## ——❋ శ్రాద్ధస్థల నిరూపణము. ❋——

పరిశుద్ధమగు ప్రదేశమున గోమయముచే నలకవలయును. స్వగృహమునం జేయ సందర్భము లేనట్లైన నదీతీరములందును, పుణ్యక్షేత్రములందును, పర్వత చర్యాలయందును, రహస్యప్రదేశములయందును, శ్రాద్ధము జేసినయెడల పితృదేవతలు తృప్తిని బొందుచున్నారు. కాన ఎప్పటికిని పరగృహమందు శ్రాద్ధము చేయరాదు. ఎవ్వడుగాని మోహంబుచే పరగృహమందునం జేసెనేని ఆశ్రాద్ధఫలమాగృహాపితృదేవతలచే నపహరింపబడును. అడవులు, పర్వతములు తీర్థములు, దేవాలయములు, అస్వామికములు గావున వానిలో జేయబడినశ్రాద్ధము ఇతరులచే గ్రహింపబడదు. ఆస్థలములందు నువ్వులం

జల్లి అజమును బంధించి శ్రాద్ధము చేయవలయును. తిలలు లేనిచో సర్వము రాక్షసులచే హరింపబడుదగును.

—*—

## * కర్మాచరణ ఫలము. *

శ్లో॥ సునిర్వర్తితాక్రియాచేత్స్యాద్దాశౌచనియమైస్సహ।
పాప్నువంతిపితృత్వంహి ప్రీయతాః కర్తృబంధవః॥
శ్లో॥ పితౄణాంచప్రసాదేన కర్తుర్వంశోభివర్ధతే।
శ్రేయసాంచాభివృద్ధిస్స్యాద్భూయసాముత్తరోత్తరమ్॥

శాస్త్రవిహిత దేశకాలములయందు శాస్త్రోక్తవిధిగా ఆశౌచ నియమముతో నాచరింపఁబడిన కర్మచే పితృదేవతలు తృప్తినొంది, కర్తవంశాభివృద్ధియు, కల్యాణవృద్ధియు కలుగఁ జేయుచున్నారు.

పైతృమేధికప్రకరణము * సమాప్తమ్.







శ్రీ రస్తు.

శ్రీదక్షిణామూర్తయేనమః.

# అపరసిద్ధాంతము.

# శ్రాద్ధప్రకరణము.

---

### ——* శ్రాద్ధశబ్దార్థః. *——

దేశకాలముల ననుసరించియు, సత్పాత్రయందును, విధిప్రకారము శ్రద్ధతో పితృదేవతలనుగురించి బ్రాహ్మణుల తృప్తిపరుచుటయే శ్రాద్ధమనిపేరు.

—*—

### ——* శ్రాద్ధకాలాః *——

అమావాస్య, అష్టకశ్రాద్ధములు, వృద్ధిశ్రాద్ధము, మహాలయపక్షము, అయనములు, సంక్రాంతులు ఈదినములలో శ్రాద్ధములను బ్రాహ్మణసంపత్తియును, ధనసంపత్తియును గలిగిన తప్పక పెట్టవలయును.

—*—

### ——* వ్యతీపాత లక్షణము. *——

వ్యతీపాత, గజచ్ఛాయ, చంద్ర సూర్య గ్రహణములు, ఇవి సహితము శ్రాద్ధకాలములు.

—*—

### ——* అష్టకశ్రాద్ధ లక్షణము. *——

హేమంత ఋతువునందును, శిశిరఋతువునందును, కృష్ణపక్ష అష్టమీలు అష్టకశ్రాద్ధముల కాలములు.

—*—

——* వృద్ధిశ్రాద్ధలక్షణము. *——

పుత్రజన్మము, వివాహాది శుభకార్యములయందు వృద్ధియ నెడు నాందీశ్రాద్ధమును చేయవలయును.

—*—

——* సంక్రమణముల లక్షణము. *——

మేషాది ద్వాదశరాసులయందు నొక్కొక్కరాశిలోను సూర్యుఁడు ప్రవేశించు దినము సంక్రమణ మనబడును.

—*—

——* అయన లక్షణము. *——

సూర్యుడు కటకరాశియందున ప్రవేశించునపుడు దక్షిణాయన పుణ్యకాలమును, మకరరాశియందు ప్రవేశించునపుడు ఉత్తరాయన పుణ్యకాలమును ఏర్పడుచున్నవి.

—*—

——* వ్యతీపాతనామ. *——

అమావాస్య ఆదివారసహితమును శ్రవణము, ధనిష్ట, ఆర్ద్ర, ఆశ్రేష, మృగశిర, ఈనక్షత్రములతో కూడినదియునైన యది వ్యతీపాత. ఇట్టి వ్యతీపాతతో వ్యతీపాతయోగము సహితముచేరిన నయ్యది మహావ్యతీపాత యనంబడును.

—*—

——* గజచ్ఛాయ లక్షణము. *——

మఖా, హస్తానక్షత్రములలో చంద్రుఁడు ప్రవేశించి యుండిన నది గజచ్ఛాయ యనబడును.

—*—

——* గ్రహణేశ్రాద్ధస్యకాలవిశేషః. *——

గ్రహణస్పర్శకాలమున పితృదేవతలను గురించియు, మధ్యకాలమున మంత్రానుష్ఠానములును చేయవలెను. మోక్షకాలమున శ్రాద్ధాది క్రియలు చేసినయెడల నవి రాక్షసప్రీతి యగుచున్నవి.

—*—

## —*యుగాది నిర్ణయః.*—

వైశాఖ శుక్ల తృతీయ, కార్తీక శుద్ధ నవమీ, మాఖ శుద్ధ పౌర్ణమీ, భాద్రపద బహుళత్రయోదశి, ఈనాలుగు తిథు యుగాదులనంబడును. ఈయుగాదులయందు శ్రాద్ధాది తర్పణము జేయవలెను.

—*—

## —*మన్వాది నిర్ణయః.*—

ఆశ్వీజ శుద్ధ నవమి, కార్తీక శుద్ధ ద్వాదశి, చైత్ర భాద్రపద శుద్ధతృతీయలు, ఫాల్గుణ బహుళ అమావాస్య, పుష్య శుద్ధ ఏకాదశి, ఆషాఢ శుద్ధ దశమి, మాఖ శుద్ధ సప్తమి, శ్రావణ బహుళ అష్టమి, ఆషాఢశుద్ధపౌర్ణమి, కార్తీక ఫాల్గుణ చైత్ర జ్యేష్ఠమాసపౌర్ణమీలు మన్వాదులు శ్రాద్ధాది తర్పణములఁ జేయదగినకాలములు.

—*—

## —*మహాలయపక్షనిర్ణయః.*—

భాద్రపద కృష్ణపక్షమున సూర్యుఁడు కన్యా రాశియందు ప్రవేశించిన నాపక్షము మహాలయపక్షము ఈపక్షమున ప్రతిపత్తు మొదలు అమావాస్య పర్యంతము ప్రతిదినమును పితృదేవతులను గురించి శ్రాద్ధాది తర్పణములఁ జేసినయెడల పితృదేవతులు సంతోషించుటయేగాక ఆయుస్సును, ఐశ్వర్యమును వృద్ధిపఱచుచున్నారు.

భాద్రపద బహుళ పాడ్యమి మొదలుకొని అమావాస్యవరకు చేయుటకు శక్తిలేనపుడు పంచమిమొదలు అమావాస్యవరకు చేయవలసినది. దీనికి నశక్తమైనయెడ అష్టమి మొదలుకొని అమావాస్యవరకు ప్రతిదినమును చేయవలెను. అట్లు చేయుటకును శక్తిలేనియెడ దశమిమొదలుకొనియైనను చేయవలెను. రోగముచేతగాని ఆశౌచముచేతగాని ఇట్లుచేయుటకు వీలులేనియెడల అమావాస్య దినమున ముఖ్యముగా తప్పక చేయవలెను. ఇట్లు లేని పక్షమున సూర్యుఁడు కన్యనుండి తులారాశి ప్రవేశించినది మొదలు వృశ్చిక రాశికి పోవువరకును సకృన్మహాలయములను పిండసహితముగా చేయవలెను.

అట్లును చేయనివారికి పితృదేవతులు శాపము నొసంగుచున్నారు.

ఈమహాలయ శ్రాద్ధము చేయుటచే గలుగుఫలము ఈదిగువ వివరింప బడినది.

మహాలయపక్షమున నొకదినము శ్రాద్ధము చేసినయెడ నొక గయాశ్రాద్ధము చేసినంత ఫలము. మహాభరణీ దినమున శ్రాద్ధము పెట్టిన ౫ గయాశ్రాద్ధములు చేసినంతఫలము. ద్వాదశియందు శ్రాద్ధముచేసిన ౧౦౦ గయాశ్రాద్ధముల ఫలము గలదు. అమావాస్యయందున సకృన్మహాలయముచేసిన ౧౦౦౦ గయాశ్రాద్ధముల చేసిన నెంత ఫలమో నంతఫలము గలుగుచున్నది.

—*—

## *గ్రంథాంతరే.*

ఈమహాలయ పక్షమున తండ్రి మృతతిథియందైనను తిథి ముఖ్యముగా చేయవలసినది.

—*—

## *సూతకాంతరిత శ్రాద్ధనిర్ణయః.*

జాతాశౌచ మృతాశౌచమధ్య ప్రత్యాబ్దికము నిలిచినప్పుడు ఆశౌచాంత్య దినమున ప్రత్యాబ్దిక శ్రాద్ధమును యథావిధిగా చేయవలెను. ఆశౌచాంత్యదినమున శూన్యతిథి వచ్చినప్పుడు ఆదినము ఉపవాసము ఉండి మరుదినము శ్రాద్ధము పెట్టవలెను.

—*—

## *దేశాంతర స్థితకర్తృశ్రాద్ధవిధిః.*

అనగ్నికుడు, భార్య సమీపములో లేని వాడు, దేశాంతర మందున్నవాడు, భార్య రజస్వలైనపుడు ప్రత్యాబ్దికమందు అన్నశ్రాద్ధము పెట్టవలయును. ఈ పై జెప్పిన కార్యములయందు అన్నశ్రాద్ధము చేయుటకు వసతి పడనపుడు మృతాహస్సును విడువక ఆదినమందు హిరణ్య శ్రాద్ధమునుగాని, ఆమ శ్రాద్ధముగాని చేసి పిమ్మట నొక పక్షము లోపల అన్నశ్రాద్ధము చేయవలెను.

—*—

—— రజస్వలాకర్తృక శ్రాద్ధవిధిః. *——

స్త్రీ కర్తృకమైన శ్రాద్ధములయందు ఆస్త్రీ రజస్వలైనపుడు ౫ వ దినమున శ్రాద్ధమును పెట్టవలయును.

—*—

——* శ్రాద్ధభోజనీయ బ్రాహ్మణ పరీక్ష. *——

శ్రాద్ధమునకు పూర్వ దినమునందు వేదమును సాంగముగా చదివిన వారిని, రోగము లేని వారలను, గృహస్థులను, బంధువులను నిమంత్రణ చెప్పవలయును.

—*—

——* శ్రాద్ధే భోజనీయాః. *——

వేదము పఠించినవాఁడు, శ్రోత్రియుఁడు, బ్రహ్మవేత్త, పూర్వవయస్కుఁడు, వేదార్థము నెఱిగినవాఁడు, సామవేది, ఉపనిషత్తులు తెలిసినవాఁడు, కర్మనిష్ఠుఁడు, తపోనిష్ఠుఁడు, పంచాగ్ని మధ్యమున తపస్సు చేయు బ్రహ్మచారి, పితృమాతృలయందు భక్తిగలవాఁడు, దౌహిత్రుఁడు, ఋత్విక్కుఁడు, అల్లుఁడు, సోమయాజి, మామగారు, మేనమామ, శిష్యుఁడు, మాతామహుఁడు, గురువు, మేనల్లుఁడు, జీవపితృఁడు, బంధువు, వీరలు నిమంత్రణ చేయుటకు తగినవారు.

—*—

——* శ్రాద్ధే వర్జనీయ బ్రాహ్మణాః. *——

రోగము కలవాఁడు, అంగహీనుఁడు, గుడ్డివాఁడు, తండ్రి చనిపోయిన పిమ్మట జనించినవాఁడు, నిజభర్తకు గాక నితరులకు పుట్టినవాఁడు, గోర్లు పుచ్చిపోయిన వాఁడు, పల్లు పుచ్చినవాఁడు, ద్రవ్యలాభమునకు వేదమును చెప్పినవాఁడు, నపుంసకుఁడు, కన్యాదూషకుఁడు, మహాశాపగ్రస్థుఁడు, అన్నను వదలిపెట్టి వివాహము చేసికొనినవాఁడు, మిత్రద్రోహి, పాపాత్ముఁడు, సోమతీగను విక్రయించు వాఁడు, మాతా పితృ గురువులను వదలినవాఁడు, కర్మత్యాగి, నాస్తికుఁడు, వీరలను శ్రాద్ధాదులయందు నిమంత్రణ చెప్పరాదు.

—*—

